# కుందమాల

[దిఙ్నాగుని సంస్కృత నాటకమునకుఁ
దెలుఁగు చేఁత]

కృతికర్త:

బులుసు వేంకటేశ్వరులు బి. ఏ.

[సంపాదకుఁడు: వావిళ్ల నిఘంటువు,
ఆంధ్రపండితుఁడు, పి. ఆర్. కాలేజి.]

ప్రకాశకులు:

గ్రంథకర్త:

రామారావుపేట,
కాకినాడ.



మూల్యము
రు 2½.

తొలికూరుపు 1947
మలికూరుపు 1950
మూఁడవకూరుపు 1950

## విషయసూచిక :

# అవతారిక

శ్రీమంత మగుసంస్కృతసారస్వతమహోదధిని గాలించుటవలన నిటీవలఁ జేజిక్కినయుత్తమరత్నములలోఁ గుందమాలానాటకరత్న మొకటి. దీనిప్రతులు తంజావూరు సరస్వతీభవనమున రెండును, మైసూరుప్రాచ్యగ్రంథాలయమున రెండును లభింప వానిని సంపాదించి యందలి క్రిమిదష్టభాగములఁ బూరించియుఁ బ్రాకృతరచనము సంస్కృతీకరించియు ౧౯౨౩వ సంవత్సరమున శుద్ధమగుప్రతిని వెలువఱచునదృష్టము శ్రీమానవల్లి రామకృష్ణకవి శ్రీరామనాథశాస్త్రిచరణుల కబ్బినది. దీని ననుసరించి యలఁతియలఁతిమార్పులతో నిటీవలనే పంజాబు సంస్కృతగ్రంథమండలివారు ౧౯౩౨వ సంవత్సరమున నొకచక్కనిప్రతిని ముద్రించి ప్రకటించిరి. ప్రకృతమదీయాంధ్రానువాదమున కిదియే మాతృక.

<u>నాటకకర్త</u>: ఈనాటకమును రచించినవాఁ డరారాలపురవాసి యగుదిఙ్నాగకవిచంద్రుఁ డని సూత్రధారోక్తివలన విదితము. కాని, యీయరారాలపుర మెచ్చటిదో యింతవఱకు నిరూపితము కాలేదు. మఱి, 'తత్త్వసంగ్రహ' భూమికయందు దీతని గుఱించిన వివరములు కొన్ని కలవు. ఈతఁడు బ్రాహ్మణుఁడు. కాంచీనగరసమీపమందలిసింహవక్త్రనగరమీతనిజన్మస్థానము. సూక్తిముక్తావళీకర్త జల్హణుఁ డీతనిని భదంతధీరనాగుఁ డని వ్యవహరించెను. ఆదియం దీతఁడు నాగదత్తుఁ డనుగురువు నాశ్ర

యించి హీనయానమతమునఁ జేరియుండెను. కాని, తుద కది నచ్చక మహాయానమతస్వీకృతిని వసుబంధుఁ డనువానికి శిష్యుఁడై కీర్తిగాంచెను. అపు డీతఁడు మహాయానమతగ్రంథముల నన్నిటినిఁ గూలంకషముగాఁ జదివి తెలిసికొనెను. ఈతఁడొకతార్కికచక్రవర్తి. ఈతఁడు రచించినగ్రంథములలో న్యాయప్రవేశము, ప్రమాణసముచ్చయము, హేతుచక్రడమరుకము, ప్రమాణశాస్త్రన్యాయప్రవేశము, ఆలంబనపరీక్ష, త్రికాలపరీక్ష మున్నగునవి ముఖ్యములు. అక్షపాదుఁడు, కణాదుఁడు, వాత్స్యాయనుఁడు మున్నగుప్రాచీననైయాయికు లవలంబించినపంచావయవవాక్యమును మూఁడవయవములతోఁ గుదిర్చి యీతఁడు పేరందెను. ఉపమానమునకు శబ్దమునకుఁ బ్రామాణ్యమును నిరసించి ప్రత్యక్షానుమానములకు నూతనలక్షణములఁ గల్పించినబుద్ధిశాలి యీతఁడే.

బౌద్ధమతానుయాయి యగునీతఁడు వైదికమతానుసారముగ గణేశస్తుతి, జటాజూటస్తుతి, అవతారనిరూపణము చేయునా యన్నప్రశ్నమునకు సింహళద్వీపనివాసియును బౌద్ధమతప్రచారకులలో నగ్రేసరుఁడయ్యును జానకీహరణమహాకావ్యమును రచించినకుమారదాసును బెద్ద లుదాహరించి యిందు సంశయింపఁ బనిలే దని నిరూపించిరి. కావునఁ, బ్రకృతము 'కుందమాలా' నాటకకర్త దిఙ్నాగుఁ డనుబౌద్ధతార్కికచక్రవర్తియే యని సిద్ధాంత మైనది.

<u>కవికాలము</u>: ఈకవికాలమును గుఱించినయాధార మొక్కటే కలదు. దానినిబట్టి యీతఁడు కాళిదాససమకాలికుఁ

డని తెలిసినది. కాళిదాసు తనపూర్వమేఘమున పదునాలుగవ శ్లోకమును

" స్థానాదస్మాత్సరసనిచుళాదుత్పతోదఙ్ముఖఃఖం ।
దిఙ్నాగానాం పథి పరిహరన్ స్థూలహస్తావలేపాన్ ॥"

అని వ్రాసియున్నాఁడు. దీనికి వ్యాఖ్యానమున మల్లినాథుఁడు;

" అత్రేదం అర్థాంతరం ధ్వనయతి. రసికో నిచుళో నామ మహాకవిః కాళిదాసస్య సహాధ్యాయీ పరాపాదితానాం కాళిదాసప్రబంధదూషణానాం పరిహర్తా యస్మిన్ స్థానే తస్మాత్ స్థానాత్ ఉదఙ్ముఖో నిర్దోషత్వాత్ ఉన్నతముఖస్సన్ । పథి సారస్వతమార్గే దిఙ్నాగానాం పూజాయాం బహువచనమ్ । దిఙ్నాగాచార్యస్య కాళిదాసప్రతిపక్షస్య హస్తావలేపాన్ హస్తవిన్యాసపూర్వకాణి దూషణాని పరిహరన్ । 'అవలేపస్తు గర్వేస్యా ల్లేపనే దూషణేపి చ' । అద్రేః శృంగం హరతి పవనః కిం స్విదిత్యున్ముఖీభిః,అద్రేఃఅద్రికల్పస్య దిఙ్నాగాచార్యస్యశృంగంప్రాధాన్యమ్। శృంగం ప్రాధాన్య సాన్వోశ్చ । హరతి కిం స్విదితిహేతునా సిద్ధైస్సారస్వత సిద్ధైర్మహాకవిభి రంగనాభిశ్చ దృష్టోత్సాహస్సన్ ఖ ముత్పతోచ్చైర్భవేతి స్వప్రబంధ మాత్మానం వా ప్రతి కవే రుక్తి రితి."

అని వ్రాసియున్నాఁడు. మల్లినాథునికిఁ బూర్వుఁ డగుదక్షిణావర్తనాథుఁ డనువ్యాఖ్యాతయుఁ గాళిదాసు నిచుళుని సరసపదమున స్తుతించి దిఙ్నాగుని స్థూలహస్తాభినయపదమున మేఘోపదేశవ్యాజమున దూషించె నని వ్రాసియుండెను.

దీనినిబట్టి దిఙ్నాగుఁడు నిచుళుఁడు కాళిదాసు సమకాలికు లని తేలుచున్నది.

<u>కుందమాలాప్రసక్తి</u>: కుందమాలానాటకప్రసక్తి పలుతావులఁ గాననగుచున్నది. వల్లభదేవుఁడు తన "సుభాషితా

వళి”లో నిందలి ద్వితీయశ్లోకము దిఙ్నాగునికుందమాలలోని దని పేర్కొనియున్నాఁడు. శారదాతనయుని “భావప్రకాశిక”లో షష్ఠాధికరణమున “కుందమాలాత్రసుశ్లిష్టా సంధి పంచక సంయుతా” యని యీనాటకము ప్రశంసితము. విశ్వనాథకవిరాజు “సాహిత్యదర్పణ” మందును, భోజదేవుఁడు “శృంగారప్రకాశము”నందును, హనుమత్కవి “మహానాటక”మందును, బహురూపమిశ్రుఁడు “కావ్యకామధేనువు”నందును నీనాటకప్రసక్తిని దెచ్చియున్నారు.

కుందమాలా ప్రశస్తి: కాళిదాసునంతటికవివరునియసూయకుఁ బాత్రుఁడైనదిఙ్నాగుఁడు మహాప్రతిభావంతుఁడు విఖ్యాతకీర్తియుతుఁడు నై యుండవలయునుగదా! ఇందులకీనాటకమే యుదాహరణము. లలితగంభీరభాషాప్రయోగము, అక్లిష్టాన్వయవాక్యరచనము నీతనిసొమ్ము. ప్రసిద్ధోపమలు, ప్రసన్నగంభీరశైలి, ప్రఖ్యాతరసస్ఫోరక ప్రతిభావ్యుత్పత్తులు నిం దద్భుతముగాఁ దలదాఁచుకొన్నవి.

ఇతివృత్తము: ఈనాటకేతివృత్తము ముఖ్యముగా వాల్మీకి విరచితమగునుత్తరరామాయణమునందలిది. కాని, నాటకీయత నాపాదించుటకై కవి మూలమును బలుతావుల నతిక్రమించెను. రామాయణమున, రాముఁడు లక్ష్మణునితో సీతను గంగ దాఁటించి తమసానదీతీరమున వాల్మీకియాశ్రమముపొంత దిగవిడచి రమ్మని చెప్పెను. (చూ. వాల్మీకిరామాయణము. ఉత్తరకాండ. ౪౫సర్గ. ౧౭, ౧౮ శ్లో.) లక్ష్మణుఁడును సీతను విడుచుచు

నటకు వాల్మీకి రాఁగలఁ డనియు నాతనియాశ్రమమున సురక్షితముగ నుండవచ్చు ననియు సీతకుఁ జెప్పెను. వాల్మీకియు సీతయాగమన ముపలక్షించుచుండును. [(చూ, పై. ౪౯ శ్లో.)] కుందమాలలో నిట్లు కాదు. లక్ష్మణుఁడు సీతను గంగకిద్దరినే విడుచును. వాల్మీకి యాశ్రమము నిద్దరినే కలదు. మఱియుఁ, గుందమాలయందలి ద్వితీయాంకకథాభాగము మూలగ్రంథమున లేదు. దిఙ్నాగుఁ డీభాగమును సృష్టించి తనయద్భుతమేధను దసనాటకరమ్యతను జూపినాఁడు. ఇందలి విషయము లనేకములు భవభూతిసైతము గ్రహించి తన యుత్తరరామచరిత్రమునఁ జొనిపియుండెను. మఱియు, రామాయణమున రామకథ విషాదాంతముగా నున్నది. కుందమాలలో నట్లుకాక నాటకము మోదాంతముగా మార్పఁబడినది.

<u>కుందమాల : ఉత్తరరామచరిత్రము :</u> దిఙ్నాగుని కుందమాలకును భవభూతియుత్తరరామచరిత్రమునకును గొన్ని సామ్యములును గొన్ని వైషమ్యములును గలవు. <u>సామ్యములు:</u> రెండునాటకములకు సీతానిర్వాసనమే ప్రధానప్రతిపాద్యమగుకథ. రెండిటికి విప్రలంభకరుణారసమే ప్రధానము. ఈయుభయమునకు నితరరసము లనుప్రవిష్టము లయియున్నవి. ఈనాటములు రెండును మోదాంతములే. ఈ ద్వయమునకు శ్రీమద్రామాయణోత్తరకాండమే యాధారము. ఇఁక, <u>వైషమ్యము</u> లరయుదము. కుందమాలలో రాముఁడు లోకపరివాదభయాకులుఁడై సీత నడవికిఁ బంపును. ఉత్తర

రామచరిత్రమున భద్రుఁడు చెప్పినరహస్యమును మనమున నిడుకొని రాముఁడు గర్భదోహదనిర్వర్తనవ్యాజమున సీత నరణ్యమునకుఁ బంపును. అదృశ్యయై యున్నసీత శ్రీరాముని సంభాషణాదికమును వినుట యాతనికిఁ దనపైఁ గలగాఢాభిమానము నెఱుఁగుట యనుదిఙ్నాగకల్పితములు భవభూతి నెక్కువ యాకర్షించుటచే నాతఁడును రాముఁడు వాసంతిఁ గాంచుట, దండకాటవి నదృశ్యయై సీత కానవచ్చుట, సృష్టించినాఁడు. భవభూతి సీతాపాతివ్రత్యప్రదర్శనమున కొకయుపనాటకముఁ గల్పించినాఁడు. కాని, కుందమాలలో మూలానుసారముగా భూదేవిచే నావిషయముఁ జాటింపఁజేయుట మిక్కిలి సమంజసముగ నున్నది. కావ్యముగ నొకవేళ నుత్తరరామచరిత్రమే మిన్న యన్నను నాటకముగాఁ గుందమాలయే యెన్నఁ దగినదనుట నిర్వివాదాంశము. భవభూతి దీర్ఘవర్ణనాసక్తుఁడు, చిత్రకవితాప్రియుఁడు; దిఙ్నాగుఁడు లలితశైలిలో మధురముగా నాటకకథ కడ్డురాకుండునంతవఱకుఁ జక్కనివర్ణనలు చూపును. అతిగా వర్ణనలుఁ బదాడంబరము నీతనికిఁ గిట్టవు. మఱియు, నుత్తరరామచరిత్రమున విదూషకుఁడే లేఁడు. ఇది భవభూతి విదూషకపాత్రపోషణశక్తిహీనతఁ జాటు నని పెద్ద లందురు. దిఙ్నాగుఁ డీవిషయమునను వన్నె గన్నవాఁడే. అన్నిటికన్న ముఖ్యమైన దింకొకటి గలదు. భవభూతిదృష్టిలో శ్రీరాముఁడు సకలగుణాభిరాముఁడు; సీత సచ్చరిత. ఎల్లెడల నీవిషయము ధ్రువపఱచుట కాతఁడు యత్నించెను. పైఁగా, సీతను విడుచు

టలో రాముని దోషరహితునిగా నిరూపించెను. దిఙ్నాగుఁడట్టిబాధ పడలేదు. సీత యుత్తమపతివ్రతయే కాని మానవస్త్రీ. ఈమానవమానినీత్వములు కుందమాలలో నెల్లెడలఁ బ్రస్ఫుటము లగుటచేతనే దీని కీవైశిష్ట్యము లభించినది.

ఇందలి ప్రథమశ్లోకమును :

"జంభారిమౌళిమాలా
జృంభన్మధుచుంబకములు హేరంబునిపా
దాంభోజరజంబులు వి
ఘ్నాంభోనిధిఁ బీల్చుఁ గాత మత్యంతకృపన్."

అని యనువదించియు నిది నాందీశ్లోక మగుట శ్రీకారాదియై మగణప్రారంభముతో నుండవలయు నను పెద్దలవచస్సాలించి పిన్నశ్లోకమును బెద్దవృత్తముఁ గావించితిని. శతకోటిప్రవిస్తరమైనరఘునాథునిచరిత్ర మీవిధమున స్మరించి ధన్యుఁడ నగుతలంపుతో దీనిని విరచించితిని. నిఘంటునిర్మాణాద్యనేక కార్యవ్యగ్రుఁడనై యుండియు నుత్సాహమువెంబడిఁ బండ్రెండు దినములలో నీనాటకమును బూర్తిగా ననువదించితిని. కావున, విజ్ఞు లిందలిదోషము విడిచి గుణమునే గ్రహింతురు గాక!

సర్వజిన్నిజశ్రావణ పూర్ణిమ.
కాకినాడ.

ఇట్లు, బుధజనవినమితుఁడు,
బులుసు వేంకటేశ్వరులు.

# ద్వితీయ ముద్రణ పీఠిక.

కవినామము : మైసూరు ప్రాచ్యగ్రంథాలయమున లభించినప్రతులలో “ఆదిష్టోఽహం పరిషదా—తత్ర భవతో ఽరారాలపుర వాస్తవ్యస్య కవేర్దిఙ్నాగస్య కృతిః కుందమాలా నామ..........।” అని యున్నది. తంజావూరు సరస్వతీ భవనమున లభించినప్రతులలోఁ బై తావునఁ గ్రిమిదష్టము కలదు. కాని, నాటకముతుదను “అనూపరాధస్య కవేర్ధీరనాగస్య” అని కలదు.

వీని ననుసరించి యరారాలపురమును గాని యనూపరాధపురమును గాని నేఁడు మనము గుర్తింపఁజాలకున్నాము. సింహళమునఁ గలయనురాధపురమున కిది భ్రష్టరూపమైయుండు ననువా రున్నారు. కాని, నాటకవిశేషములనుబట్టి యేతత్కవి సింహళదేశీయుఁడు కాక దక్షిణాపథమునకుఁ జెందియుండ వలయు నని స్పష్టముగాఁ దెలియుచుండుటచే నీతఁడు సింహళ దేశీయుఁ డనువాదము వీఁగిపోయినది.

ఇఁక, నాటకకర్తనామము “దిఙ్నాగుఁడా” లేక “ధీరనాగుఁడా” యన్నవిషయము సమాలోచనీయము. “సూక్తిముక్తావళీ” కర్తయగు “జల్హణుఁడు” “భదంతధీరనాగుఁ”డని యొకనిఁ బేర్కొనియుండుటతక్క “ధీరనాగ” నామము సంస్కృత సారస్వతమున నెచటను గానరాదు. మఱి “దిఙ్నాగ” నామము మిక్కిలి ప్రసిద్ధము. “వల్లభదేవుఁడు” “సుభాషితావళి”లో నిందలి రెండవశ్లోకమును బేర్కొని యిది “దిఙ్నాగుని కుందమాలలోని”దని తెలిపియుండుట ఈనాటకము దిఙ్నాగకృతమే కాని ధీరనాగకృతము కాదనుటకుఁ బ్రబలనిదర్శనము.

నాటకకర్తగా దిఙ్నాగుఁడు : కుందమాలానాటకకర్త యగుదిఙ్నాగుఁడును, బౌద్ధతార్కికచక్రవర్తియగుదిఙ్నాగుఁడును భిన్నులా యన్నవిషయము సమాలోచనీయము. నాటకము నందలియాంతరనిదర్శనములఁబట్టి యిది భాసనాటకములకుఁ దరువాతి దనియు నందలి ప్రాకృతభాషాపరిణామములనుబట్టి క్రీ॥శ॥ నాలుగైదుశతాబ్దములకుఁ జెందియుండు ననియు విమర్శకు లభిప్రాయపడియున్నారు. మేఘసందేశమందలి "స్థానా దస్మాత్ ..." అనుశ్లోకమునకు దక్షిణావర్తమల్లినాథులు వ్రాసిన వ్యాఖ్యానమునుబట్టి యీతఁడు కాళిదాససమకాలికుఁ డన్న వాదము నీకాలమునే సూచించుచున్నది. బౌద్ధతార్కికుఁ డగు దిఙ్నాగునికాలము నీకాలమే యని యాతనిగ్రంథములను చైనాభాషలోనికి క్రీ॥ శ॥ 557-569లో పరమార్థుఁ డనువాఁ డనువదించియుండె నన్నవిషయము బలపఱుచుచున్నది. దిఙ్నాగునిసమకాలికు లగునితరతార్కికులతో నీతనికిఁ గలసంబంధము ననుసరించియు నీతఁడు క్రీ॥శ॥ నాలవశతాబ్దాంతమునఁ గాని యైదవశతాబ్దారంభమునఁ గాని విలసిల్లియుండవలయు నని సూచించుచున్నది. న్యాయసూత్రభాష్యకర్త యగువాత్స్యాయనుని దిఙ్నాగుఁడు విమర్శించి యుండుటయు; దిఙ్నాగుని "ప్రశస్తపాదుఁడు"నాతనితరువాతివాఁడున్యాయవార్తికకర్తయు నగు "ఉద్ద్యోతకారుఁడు" విమర్శించియుండుటయు; కుమారిల భట్టునకు సమకాలికుఁ డని విశ్వసింప నగువగుఉద్ద్యోతకారుని ధర్మకీర్తి సమాధానపఱచుటయు; ఈధర్మకీర్తినిగుఱించి క్రీ॥శ॥ 671-695 ప్రాంతమువాఁ డగు "ఇత్సింగు" అను చైనాదేశస్థుఁడు

చెప్పియుండుటయు; ఈదిఙ్నాగు లిద్దఱు సమకాలికు లని ధ్రువ పఱచుచున్నవి. ఈసమకాలికత్వమే యిరువురు నొక్కఁడేయను టకు బలము. కాని, నలందాదివిశ్వవిద్యాలయములలోనిదిగ్దంతు లగుహైందవపండితుల నోడించి గర్వించి బ్రాహ్మణవేదాంత సూత్రవ్యతిరేకి యని పొగడ్త గన్నబౌద్ధుఁ డెట్లు హిందూ దైవము లగుగణేశశివాదులను దననాటకమున స్తుతించి విష్ణు మూర్తియవతారనిరూపణమును జేయును? అన్నది గడ్డుప్రశ్న. దీనివలన నతఁడు వే ఱితఁడు వే అనవలయును.

లేదా- దిఙ్నాగుఁడు మొట్టమొదట హైందవమతాభి మాని. ఆతఁడు తొందరపడి హిందూమతమును విడిచి "నాగ దత్తుఁ" డనుగురువు నాశ్రయించి హీనయానబౌద్ధశాఖలోఁ జేరెను. కాని, యం దాతనికిఁ దృప్తి కలుగనికారణమున "వసు బంధుఁ" డనువాని నాశ్రయించి మహాయానబౌద్ధమును స్వీక రించెను. ఈనడిమికాలముల నాతఁ డన్ని మతగ్రంథములను జదివి మహాపండితుఁడై దిగ్విజయములను గాంచెను. ఆకాలముననే యీతఁ డెన్నియో యుద్గ్రంథములను రచించెను. ఆపిమ్మట వార్ధక్యమున నీతనికి బౌద్ధమతమందును విశ్వాసము సన్నగిల్ల మరల హిందూమతమునే విశ్వసించి తిరిగి యిందు వచ్చి చేరియుండును. అపుడే యీనాటక మీతఁడు రచించియుండ వలయును. అందుచేతనే యీనాటక మందలి హైందవసంప్ర దాయప్రాచుర్యవర్ణనము లింతలోఁతుగను ఇంతగా మనసునకు హత్తునట్లుగను నున్నవి. కవి తనకావ్యమునఁ బ్రతిఫలించితీరు నన్న పెద్దలవాక్యము సత్యము. అందుచే దిఙ్నాగుని మానసిక జీవితపరివర్తనములు క్రిందిశ్లోకమున సూచితములు :

"సంతాప్యలోకమఖిలం నిరవగ్రహేణ......"
"తనతీవ్రాంశుమయూఖమాలికలచేతన్ లోకమల్లార్చి......
...దివసావసానమునఁ జెందున్ భానుఁడున్ శాంతమున్."
(౪ అం. 23 ప.)

అట్లే, కాళిదాసాదులు తన్నుఁ దర్కకర్కశుఁ డని రసవిహీనుఁ డని విమర్శించుటయు దాని కోడలుమండి సాహిత్యమను జీవనదిలోఁ బడి కుందమాలానాటకరూపమున నిరంకుశముగా విహరించి సాహిత్యనదిని గల్లోలిత మొనర్చి యొడ్డుల వఱకుఁ జేరినకాళిదాసాదులకీర్తి యనుచెలియలికట్టలను దా నతిక్రమించి స్వమత గౌరవమును బ్రతిపాదించి సరసబంధుర మగు కుందమాలానాటకమును దుదికాలమున రచించినట్లును ఈక్రింది శ్లోకము ఘోషించుచున్నది.

"మధ్యాహ్నార్కమయూఖతాపమధికం......"
"మధ్యాహ్నార్కమయూఖతాపశిఖచే బ్రుందన్ శరీరంబు......
......వేదండరాజంబు తాన్."
(3 అం. ౧౭ ప.)

ఈనామసామ్యమాహాత్మ్యమును జక్కఁగఁ జాటుట కొఱకే దిఙ్నాగుఁడు కుందమాలయందు మదనాగవర్ణనము నెన్నిమాఱులో చేసినాఁడు. అర్థాంతరముచేఁ దనయున్నతి నట్లు చెప్పుకొన్నాఁ డనుట యెంతయు సమంజసముగఁ గన్పట్టక పోదు-అని యనవలయును.

కుందమాల : కాలపరిమితి: సీతానిర్వాసముతో నాటక మారంభమై పదిసంవత్సరములకాలము నిది సూచించును. ఐదవయంకమున విదూషకుఁడు రామునితో సీతను విడిచి పదియేండ్లైన దని చెప్పియుండుట దీనికి సాక్ష్యము. తొలియంకమున లక్ష్మణుఁడు సీత నడవిలో విడిచి వచ్చుట కొకదినము

కంజె నెక్కు-చ పట్టినట్లు తోఁచదు. సాయంతనము సీతను విడిచి రాత్రి ప్రొద్దుపోయినతరువాత నాతఁ డడవినుండి యింటికిఁ బోవును. మొదటియంకమునకును రెండవయంకమునకును నడుమఁ గలకాలము పదివత్సరములు. రామునియశ్వమేధము నకు సర్వసంభారములు సంసిద్ధ మగుటయు రామదూత వాల్మీ క్యాశ్రమమునకుఁ బిలువవచ్చుటయు నిట జరుగును. మూఁడవ యంకము రెండవయంకమునకుఁ దరువాతిదినమునందలియుదయ కాలమున నారంభమై మధ్యాహ్న మతిక్రమించినతరువాతఁ బూర్తి యగును. మూఁడవయంకమునకును నాల్గవయంకమున కును నడుమ నైదుదినములు పట్టియుండును. నాఁటికే కుశలవు లతోఁ సీత వచ్చి యేడుదినములు, ఒకదినమాలస్యముగా వచ్చు టచే రాముఁడు వచ్చి యాఱుదినములు, నగును. అందుచే నాల్గవ యంకము మూఁడవయంకకాలమున నైదుదినములతరు వాత నుదయమున నారంభమై సూర్యాస్తమయముతోఁ బూర్తి యగును. మఱుచటిదిన ముదయముతోఁ బంచమాంక మారంభ మగును. ఐదవయంకము నాఱవయంకము రెండును గలిపి కొన్నిగంటలకాలపరిమితి మాత్రమే సూచించును. కుశలవుల రామాయణగానము మాధ్యాహ్నకక్రియలకుఁ బూర్వమే సమాప్తము కావలయు నని వాల్మీకి యాదేశించుటవలన నిది విదితము.

<u>దిఙ్నాగునికావ్యకళానైపుణ్యము:</u> (i) దిఙ్నాగునికవితా సౌష్ఠవముఁ గన్నవారి కీతఁడు కాళిదాసునసూయకుఁ బాత్రుఁ డయ్యె ననుటలో సందేహము కలుగదు. అన్వయకాఠిన్యము

లేనియమృతశైలి దిఙ్నాగునిసొమ్ము. ఆతనివచనము పద్యము కూడ లలితముగను మధురముగను నుండును. అందుచే నవి సులభగ్రాహ్యములు. చిన్నమాటలలో నెంతో చక్కనిభావమును లీతఁడు వ్యక్తము చేయఁగలదిట్టు. ఉదాహరణమునకు రాముఁడు కణ్వునితో నన్నమాటలు :

"గీ. బాల్యమున రాముఁడను నీవుఁ బలుకరింపఁ
గణ్వుఁడవు నీవు నాకు నా కాలమునను ;
మిమ్ము నార్యులఁ జేసెఁ గాలమ్ము నేఁడు
మమ్ము రాజులఁ జేసెఁ దన్మహిమఁ గంటె!" (IV. 2.)

(ii) "ఉపమా కాళిదాసస్య" యన్నంతకీర్తి దిఙ్నాగునికి లేకపోయినను, ఈతని యుపమలును గమనింపఁదగినవి: "దవానల పరిశుష్య మగుతు పారబిందువువలె" (౨ అంక. 69. పుట.)

" మహితమధ్యాహ్నభానునుమ్మలిక కోడి......
ఛాయలెల్లను మెల్లన సాగిపోయె." (iii. ౧౬.)

"గగనలక్ష్మి సూర్యేందులఁ గన్నయట్లు." (vi. 17) పలు తావుల నీతఁ డిట్టియుపమల నద్భుతముగాఁ జూపిపి కావ్యోదాత్త్యముఁ గూర్చినాఁడు.

(iii) "కరుణస్యమూర్తి రథ వా౽ శరీరిణీ" అన్నభవభూతి ప్రజ్ఞాసూచక మగుమాట దిఙ్నాగుని కంత వర్తింపక పోయినను,దిఙ్నాగునిమహోత్తమకరుణరసపోషణము మిగులఁ బ్రశంసనీయము. సీతశోకమును వర్ణించుపట్టుల లక్ష్మణునివాక్యములు.

"పచ్చికమాని యీహరిణవారము సైతము నేడ్చు మిక్కిలిన్......
......మనుజసంతతికంటెఁ బసుల్ మెఱుంగెయా." (i. 18)

(iv) రాముఁడు సీతను విడిచిపెట్టుటలోఁ గలయనౌచిత్యమును దానే యిట్లుపలుకుకొనుచున్నాఁడు :

"ఆకరణిన్ మహాగిరుల నంబుధిఁగట్టుట వ్యర్థమయ్యె..."(iii. 3)

(v) సీతకుఁ గలుగుచువచ్చినకష్టపరంపరల రామునినోటఁ గవి యెట్లుపలికించి కరుణరసము చిప్పలఁజేసినాఁడో కనుఁడు.

"తొలి వనవాసము, లంకన్
మలి వనవాసంబు; నేఁడు మరలఁ బ్రవాసం
బిల నన్యధన్యఁ గూడుటఁ
జెలి దుఃఖముమీఁద దుఃఖసిద్ధిఁ గనెఁ గటా!" (iii. 13)

(vi) ఒకప్రవాసియొక్క చిరకాలవియోగబాధను జెప్పు పట్లఁగల (v. 30) పద్య మెంతయు రమణీయమై దిఙ్నాగుని మానవహృదయావలోకనశక్తిని జాటుచున్నది. కుశలవుల హృదయములలో రామునిం జూడఁగానే కలిగినగౌరవాతిశయ మును వర్ణించుపట్టున దిఙ్నాగునినిపుణత యతిమనోహరము. కుశలవులను జూడఁగనే రామునికిఁ గలిగినకన్నీటివెల్లువకుఁ గారణము కనుఁడు.

"తెలియకయుండిరే హృదయదీప్తము లైనఋణానుబంధముల్...
...చంద్రుపుట్టుకన్." (v. 10)

ఇట్లే సీతారాములప్రేమావేశహేతువు, రాముని బాహ్యాభ్యంతరహృదయస్థితిభేదము మున్నగునవి బహురమణీయముగఁ జెప్పఁబడినవి.

(vii) ప్రకృతిప్రశాంతవర్ణనము నైమిశారణ్యవర్ణనమునఁ జక్కఁగాఁ జూపినదిఙ్నాగుఁడు ప్రకృతిభీకరరూపమును బ్రౌఢము గనే వర్ణించినాఁడు :

"పాతాళప్రభవంబునై భువి దివిన్ వ్యాపించె నిర్ఘోషము..."(vi.24)

(viii.) అరణ్యమార్గమును వర్ణించుచు నటఁ గలకంట

కాములతో నిండినదారి నెంతసహజముగా స్వభావోక్తితో దిఙ్నాగుఁడు వర్ణించినాఁడో కనుఁడు:

"ఇవి కుశకంటకంబులు..." (i. 30)

"ఇది యొక వేత్రవల్లి......" (iii. 8)

ఇదేవిధమున నేతావృతఁ గనినను దిఙ్నాగుని యసమాన కళానైపుణ్యము కుందమాలలోఁ బ్రవ్యక్తమగుచునే యుండును.

<u>కుందమాలలోని పురాణగాథాదికము:</u> ఈనాటకమును బట్టి చూచినచో దిఙ్నాగునికాలమునాఁటికిఁ బౌరాణికహిందూ మతము పరమప్రశస్త మగుపరిణతి నందియుండె ననుట తేటతెల్లము. కాళిదాసునకువలెనే దిఙ్నాగునకును బురాణాదుల సువ్యక్త మగుహైందవసంప్రదాయములు చక్కఁగ విదితములు.

శ్రీరాముఁ డవతారపురుషుఁ డని "హరి యాతఁడే యగున్" (iii. 14) అనియు, నాతఁడు "శ్రీయుత పద్మనాభుఁ" డనియుఁ గవి పేర్కొనుటే కాక వరాహావతారాదివిషయముల నిందుఁ దెలిపియున్నాఁడు.

గంగానది "జాహ్నవి" గా "భాగీరథి" గా "మాత" గాఁ "గన్నతల్లి" గాఁ బేర్కొనఁబడినది. గంగమ్మకెరళ్లమీఁది లేగాలులు బడలిక నేకాదు పాపములను బాపఁగల్గునవిగాఁ జెప్పఁబడినవి. గంగానది కుపహారము లర్పించుపరిపాటియు నామె శివజటాజూటోద్భవ యనియు నిందుఁ దెల్పఁబడినది.

ధరిత్రిని గోరూపను జేసి దేవత లోషధులను బిదికికొన్న గాథయు (vi. 27) భూమిని శేషుఁడు మోయుటయు (vi. 27) నాగజగమున వెలసిన వాసుకి (vi. 42) మునులు భూదేవిని రెండవప్రణవ మన్నసంగతి (vi. 31) భూమికి గంగ మాల

యగుట సముద్రము మేఖల యగుట మున్నగువిషయములు; వేదములు మూఁడే యనుట (vi. 1) మున్నగుపురాణగాథ లింకఁ గలవు. శివస్తుతి, జటాజూటప్రసంగము, గణేశ్వరస్తుతి, ఇంద్రప్రశంస మున్నగునవి కలవు. క్రతువులు, క్రతుహోమము, నైమిశము, పూర్వర్షిప్రభావము నిందెక్కువగా వర్ణితములైనవి.

ఈకారణముచే దిఙ్నాగునికాలమునకు హిందూమత సంప్రదాయములయుఁ బురాణగాథలయుఁ బ్రాబల్య మధిక ముగాఁ గల దని వెల్లడియగుచున్నది.

కుందమాలానాటకమునాఁటిసాంఘికస్థితి: ప్రతికావ్యము నది యుద్భవించిననాఁటిసాంఘికస్థితిని బ్రత్యక్షముగనో యప్ర త్యక్షముగనో తెలుపక మానదు. అట్లే కుందమాలానాటక రచనాకాలమునందలి సంఘస్థితిగతులు నిందు ద్యోతకము లగు చుండును.

బ్రాహ్మణుల కాకాలమున మిక్కిలిగౌరవప్రతిపత్తులు గలవు. మహారాజులును వారి నెన్నివిధములుగనో సేవించెడి వారు. మునికుమారులుగాఁ బరిగణింపఁబడినకుశలవులు రాము నకు నమస్కారము చేయఁగనే రాముఁడు బ్రహ్మశిరోనతుఁడ నైతినే యని గన్నపరితాపము దీని కొకనిదర్శనము. మఱియు 'బ్రాహ్మణులకు శుభమగుఁగాక' (vi. 96 పుట.) మున్నగు వాక్య ములవలన సంఘమున బ్రాహ్మణగౌరవ మత్యధికముగ నుండె ననుట తథ్యము.

తపోధను లన్న నాఁడు ప్రజలకును రాజులకును భయ భక్తు లుండెడివి. అంతేకాదు వారు మహాశక్తిసంపన్ను లన్న గాఢవిశ్వాస మందఱి కుండెడిది:

"ఘనతపోవస్మ లైనట్టిమునులయొవను
శరపరంపర మోఘమై తిరిగిపోవు:......" (v.14)

వారిలో వాల్మీకివిశ్వామిత్రవసిష్ఠాదు లగ్రగణ్యులు. వారు "ప్రభావప్రత్యక్షీకృత సర్వలోకరహస్యులు" (vi 95 పుట) వారిశరీరములు "స్వస్త్యయనపరిగృహీతములు" (v. 78పుట.)

నాఁడు గోవులు పరమపూజ్యములుగాఁ గొండాడఁబడుచుండెడివి. "గోవులకు శుభమగుఁగాక!" "వర్ధిలుఁ గావుత! గోకులంబులున్." (vi. 45) అన్న వాక్యములు నిందులకు నిదర్శనములు.

ఆకాలమునను స్త్రీలకు సంఘమున గొప్పగౌరవము కలదు. స్త్రీ లేనిదే పురుషునకు యజ్ఞము చేయునర్హత లేదు. స్నానవిహారసమయములలో స్త్రీలు పరపురుషనయనగోచరలు కారా దనునాచార ముండెడిది. పుంసవనము, సీమంతము మున్నగు గర్భిణీసంస్కారవిశేషములు నాఁడు పరిపాటిలో నుండెడివి. (i. 31.) ప్రయాణసమయముల మంగళాచరణము మున్నగుక్రియలు బలిదానాదులు జరుగుచుండెడివి.

ఆదినములలో నున్నతవంశజు లగు రాజాదులమరణానంతరము వారిప్రతిమలు తయారుచేయించి వానిని బూజించు నాచార ముండెడిది. "ప్రతిమాగతు లగుమహారాజులకు శుశ్రూష లొనరింపు" మన్న (i. 13, 14 పుటలు.) వాక్య మిందుల కుదాహరణము.

ఇట్లే బహువిషయములు బ్రాహ్మణగౌరవసూచకములు, హైందవసంప్రదాయద్యోతకములు నిందు సువ్యక్తము లయియుండుటవలన నీనాటకకర్త యగుదిఙ్నాగుఁడు హైందవుఁడయియే దీనిని రచించె ననుట నిర్వివాదాంశముగాఁ దోఁచుచున్నది.

కుందమాల: సుభాషితములు. ఇందు నటనట నెన్నో సుభాషితములు కలవు.

1. "సంపద నడఁచుఁ బ్రమాదము;
చంపున్ దర్పాతిశయము సమ్యక్ప్రీతిన్." (iii. 2)

2. "దప్పికంగాని యజ్ఞానతమము గప్ప......" (iv. 22)

3. "అనురాగంబులు మానసస్థములు, బాహ్యస్ఫూర్తికిన్ గర్హ్యశం
బని తోఁచున్..." (v. 6)

4. "నరపతులు మేరమీఱిన
నుపబుద్ధులు సచివు లడ్డు టొప్పును..." (v. 7)

5. "నిత్య మాభ్యంతరం బయి నెగడు జ్యోతి......
......పవను చేతఁ గదా? యగ్ని వ్యవహరించు." (v. 8)

6. "తెలియకయుండిరే హృదయదీప్తము లైనఋణాను
బంధముల్..." (v. 10)

7. "బాలభావమునసె శూలి మౌళియందుఁ
గేతకచ్ఛదతను గాంచి కెరలె విధుఁడు." (v. 12)

8. "ఘనతపోవర్మ లైనట్టి మునులయెడను
శరపరంపర మోఘమై తిరిగిపోవు." (v. 14)

9. "అనురాగం బది ప్రాకృతంపుజనమం దత్యంతసంవర్ధకం
బను విస్ఫారితమున్ సుఖప్రదమునై పొందించు
నానందము..." (vi. 22)

10. "ధర్మపత్నీ పరిగ్రహాధన్యున కిల
నిష్టము నపత్యము ఫలంబు లెందు ననిరి, బుధులు..." (vi. 38)

రామాయణమందలి సీతానిర్వాసకథాసంగ్రహము :

వాల్మీకిరామాయణములో ఉత్తరకాండమున ౪౩ వ సర్గనుండి యీకథ గలదు. చారుఁడు రామునితో లోకాపవాదమును దెలుపుటయు, నాతఁ డేకాంతమునఁ దమ్ములఁ బిలిచి యీవిషయముం దెలుపుటయు, పిమ్మట లక్ష్మణునితో రాముఁడు సీతను రథమునఁ దీసికొనిపోయి యయోధ్య కవ్వలఁ గలగంగను

దాఁటి దానియొడ్డునఁ గల వాల్మీక్యాశ్రమప్రాంతములఁ గల తమసానదీజనశూన్యప్రదేశమున దిగవిడిచి రమ్మనుటయు, లక్ష్మణుఁడు సీతను గంగాగమనవ్యాజమున నట్లు చేయుటయు నాతఁడు మరల గంగను దాఁటి పురమును బ్రవేశించుటయు, నట వాల్మీకి సీత నూరడించి దనయాశ్రమమునకుఁ దీసికొని పోవుటయు, సీతకై వగచులక్ష్మణుని సుమంత్రుఁ డూరడించి భృగుశాపంబున రాముఁడు సీతను వదలె నని పూర్వవృత్తాంతమును దెలుపుటయుఁ, దరువాతఁ గొంతకాలమునకు లవణాసురవధార్థము శత్రుఘ్నుఁ డేఁగుచు వాల్మీక్యాశ్రమమున నాఁగి సీత కుశలవులఁ గన్న దని యెఱుంగుటయు, శత్రుఘ్నుఁడు పండ్రెండేండ్లకుఁ దిరిగి యయోధ్యకు వచ్చుటయు, శ్రీరాముఁ డశ్వమేధముఁ జేయఁబూనుట, కుశలవులతో వాల్మీకి యశ్వమేధముం జూడఁ బోయి వారిచే నట రామాయణగానము చేయించుటయు, రాముఁ డాకర్ణించి కుశలవులను దనపుత్రులుగా నెఱింగి సీత సభలో శపథముచేయునట్లు చేయు మని వాల్మీకిం బ్రార్థించుట, వాల్మీకి సీతతోఁగూడ సభకు వచ్చి కుశలవులు సీతసుతు లగుటం దెలిపి సీతచే సభలో శపథము చేయించుటయు, సీత యట్లు చేసి భూదేవిం గలియుట, శ్రీరాముఁడు సీతకై శోకించి భూదేవిని భస్మముచేయంబూని బ్రహ్మచే నివారింపఁబడుటయు, శ్రీరాముఁ డశ్వమేధమును బూర్తిచేసి కొడుకులతో నయోధ్యఁ బ్రవేశించుటయుఁ గలదు.

కుందమాల : ఆంధ్రీకృతులు: 1932 లో శ్రీ వ. సు. రాయకవిగారు తమ తెలుఁగుకుందమాలను బ్రకటించిరి. పిమ్మట, కవితావతంస శ్రీ గట్టి లక్ష్మీనరసింహశాస్త్రిగారు 1943 సంవత్సరమునను విద్వాన్ వేదము వేంకటకృష్ణశర్మగారు 1949 సంవత్స

రములోను నను కుంవమాలాంధ్రీకృతులను బ్రకటించియుండిరి. నేను 1947 లో నాయనువాదమును దొలుతఁ బ్రకటించితిని.

కృతజ్ఞత : ఈనాయాంధ్రీకృతి యందలి గుణలేశమునే గ్రహించి యాంధ్రవిశ్వవిద్యాలయ గ్రంథనిర్ణాయక సంఘము దీనిని 1952 ఇంటర్మీడియటు పరీక్షకు పాఠ్యగ్రంథముగా నిర్ణయించి నాకృతిని మన్నించినందుల కాసంఘసభ్యుల కిందు మూలమున నాకృతజ్ఞతఁ దెలుపుకొనుచున్నాను.

ఈముద్రణమున : దిఙ్నాగునికవితావైభవము నాంధ్రపాఠకులకుఁ దెలుపుటకై వేలవము లగునాపదములుగాక సాధ్యమైనంతవఱ కాతనిపదములనే యనువాదమున నిలిపితిని. అవి సువ్యక్తములగుటకు లఘుటీక యీముద్రణమునఁ జేర్చితిని. ప్రథమముద్రణపీఠికకనుబంధముగా నీద్వితీయముద్రణపీఠికయుఁ జేర్చితిని.

విక్రృతిజ్యేష్ఠము,
కాకినాడ.

ఇట్లు బుధవిధేయుఁడు,
బులుసు వేంకటేశ్వరులు.

తృతీయముద్రణపీఠిక.

ద్వితీయముద్రణమునఁ గల (iii. ౧౧); (v. ౧౩); (vi. ౪౪) పద్యములు మాత్రమించుక మూలాతిక్రమణములుగాఁ గానసగుచున్నవని మన్మిత్రులు బ్రహ్మశ్రీ దివాకర్ల వేంకటావధాని, ఎం. ఏ. అనవారుగారు దయతో సూచించిరి. నేను వానిని బునర్విమర్శించి పైమూఁడు పద్యములు నీముద్రణమునఁ గొంచెము మార్చి చేర్చితిని. పూర్వముద్రితపద్యములను గ్రంథాంతమునఁ జూపితిని. చదువరు లీమార్పు గమనింతురుగాక !

కాకినాడ,
1-7-'50.

బులుసు వేంకటేశ్వరులు.

# కుందమాలా నాటక పాత్ర వివరణము

## పురుషులు :

రాముఁడు — నాయకుఁడు.
లక్ష్మణుడు — రాముని తమ్ముఁడు, సహచరుఁడు.
సుమంత్రుఁడు — సారథి.
వాల్మీకి: — శ్రీమద్రామాయణకర్తయగు మహర్షి.

| | |
|---|---|
| కశ్యపుఁడు<br>బాదరాయణుఁడు<br>కణ్వుఁడు | ఋషులు. |

కౌశికుఁడు: — విదూషకుఁడు.
కంచుకి
కుశలవులు: — సీతారామ సుతులు

## స్త్రీలు :

సీత: — రామపత్ని, నాయిక.

| | |
|---|---|
| వేదవతి<br>యజ్ఞవతి<br>యజ్ఞవేది | ఋషికన్యలు. |
| కౌసల్య<br>కైకేయి<br>సుమిత్ర | దేవీత్రయము. |
| ఊర్మిళ<br>మాండవి<br>శ్రుతకీర్తి | వధూత్రయము |

భూదేవి.
వృద్ధ: — వాల్మీక్యాశ్రమవాసిని.
తిలోత్తమ: — స్వర్వేశ్య.

## : స్థలము :

గంగాతీరమందలి వాల్మీకి యాశ్రమము
గోమతీతీరమందలి నైమిశారణ్యము

# నివేదనము

శ్రీమద్భారతభాగ్యదైవము చతుస్సీమామహావ్యాప్త తే
జోమాన్యాత్ముఁడు బ్రహ్మవర్యుఁడు యశశ్శుద్ధాత్మ దేహుండు మ
త్ప్రామాణ్యార్యగుణోత్తముండు త్రిజగత్కల్యాణసంధాత యి
ష్టామూల్యార్థవిధాత యాతని పదాబ్జద్వంద్వముల్ గొల్చెదన్.

పరతత్త్వామృతపాన మానసమహాభాగ్యంబు నందిచ్చు స
ద్గురుదేవున్ నరమాత్రుఁగాఁ దలఁచు దుర్దోషోపశాంత్యర్థమున్
దురదృష్టాత్మ రజోగుణోద్ధతిఁ దమోదోషాళిఁ దత్సేవ నే
మఱుపాపౌఘవినాశనార్థమును సంభావింతు నస్మద్గురున్.

ఒక సందర్శనయోగలేశమె యనేకోద్గ్రంథపారాయణ
ప్రకటప్రాభవ మిచ్చు, నొక్కతలఁపే భావింప నజ్ఞాన నా
శకమౌ, నొక్కమృదూక్తియే సకలభాష్యగ్రంథసారంబు నా
సుకృతాభ్యాసుల కట్టి సద్గురుని సుశ్లోకింతు భక్త్యున్నతిన్.

అవతారంబును దాల్చి మున్ను రఘురామాఖ్యన్ గృపామూర్తియై
భువి ధర్మంబులు నిల్పి నేఁడు మరలన్ భూభారమున్ బాప ను
ద్భవమైనట్టి పరాత్పరుం డతఁడు మద్భాగ్యంబుచే నబ్బె నా
కవితాసుందరికిన్ విభుండు సకలాకాంక్షాఫలావాప్తికిన్.

జననంబందినవాఁడ శ్రీ బులుసు వంశంబందు నాయక్షపా
దుని సద్గోత్రజుఁడన్ మహేశపదభక్తుండన్ గురున్ శర్మగాఁ
గని పూజించెడి వేంకటేశ్వరుఁడఁ దత్కారుణ్య మర్థించు నే
పనిగాఁ దత్పదపంకజంబుల కిదే భక్తిన్ నివేదించెదన్.

కుందమాల:




కృతికర్త.

"పరువ మెడలకుండ వాసన చెడకుండ
వాడకుండఁ గరము పదిలపఱిచి
కుందమాల నిడియె గురుపాదముల మ్రోల
బులుసు వేంకటేశ్వరులు బుధుండు." —అభినవతిక్కన.

ఓం

శ్రీగురుభ్యో నమః.

# కుందమాల

## నాంది



రమణీయ దేవకుల
శేఖర మౌళి విరాజమాన మం
దార లతాంత మాలిక స్రు
తమ్మగు తేనియ ముద్దుగొంచుఁ జె
న్నారెడు విఘ్ననాయక ప
దాంబుజ పాంసువు లంతరాయ వి
స్తార మహాంబుధిన్ సరభ
సం బగువృత్తిని బీల్చివేయుతన్ ! ౧

సూత్ర :—(నాంద్యంతమునఁ బ్రవేశించి)

మ. పరిపక్వోర్ధ్వ విసర్పణాంతర తపో
వహ్నిజ్వాల జ్వాలయో,
వర గంగోద్భవ వీచికాఘణిలస
ద్వల్మీకమో, స్నిగ్ధసుం
దరశీతాంశుని నిత్యసంధ్యయొ, యనన్
బాలారుణార్కద్యుతి

స్ఫురణాశ్రీఁ జెలువొందునీశ్వరజటా
జూటంబు మి మ్మోముతన్ ! ౨

అరాలపురవాసి యగు దిఙ్నాగకవిచంద్రుఁడు సంస్కృతమున రచింపఁ గాకినాడ పురవాసి బులుసు వేంకటేశ్వరులాంధ్రీకరించిన కుందమాలా నాటకమును బ్రదర్శింప సభాసదులు నా కాజ్ఞాపించిరి. ఆనాటక సందర్భమునకుఁ బ్రయోగ సాచివ్య విధాయిని యగు నార్యను బిలిచి నేను రంగభూమి కరిగెదను.

(తెరలో)

ఆర్యా! ఇట నవతరింపుము.

సూత్ర:- అదిగో! ఆర్యాసమాహ్వానమున నా కెవ్వరో కాని సాహాయ్య మొనరించుచున్నారు. (విలోకించి) అయ్యో! కష్టము! కష్టము! అతికరుణకృత్యము జరుగుచున్న దే!

శా. లంకానాథుని యింట సీత చిరకా
లం బుండె నన్నట్టి ని
శ్శంకా తంక జనాపవాదమునకున్
జాలన్ భయం బంది త
త్పంకం బింకఁగ సాధ్వి గర్భిణిని ని
ర్వాసింప శ్రీరాముఁ; డీ
వంకన్ లక్ష్మణుఁ డార్య నీడ్చుకొని పో
వం జొచ్చె దుర్గాటవిన్.

(నిష్క్రమింతురు.)

ఇది స్థాపన.

ఓం

# కుందమాల

## ప్రథమాంకము

(అంత రథారూఢులై సీత, లక్ష్మణుఁడు, సుమంత్రుఁడుఁ బ్రవేశింతురు)

లక్ష్మ:-ఆర్యా! ఇట నవతరింపుము. భాగీరథీతీరకాననప్రదేశము లీగహనతరులతాప్రతానములతో మార్గావరోధకములై రథప్రవేశయోగ్యములు కాకున్నవి. ఆర్యా! ఇట నవతరింపుము.

సీత:-వత్సా! లక్ష్మణా! మనరథాశ్వము లతివేగముగాఁ బరుగెత్తినవి. ఆరథముకుదుపునకు దేహ మంతయుఁ గంపించిపోయినది. లేవనే లేకున్నాను. ఇఁక నెట్లు దిగఁగలనో!

లక్ష్మ:-సుమంత్రా! రథాశ్వముల నాఁప యత్నింపుము.

సుమం:-ప్రభూ! గాంధర్వప్రియములై యీహయము లెంతగా నాఁప యత్నించుచున్నను బరుగెత్తుచునే యున్నవి:

మ. కలహంసాళియమంద్రనాదములు సౌ
ఖ్యస్ఫూర్తిఁ గర్ణంబులన్
మెలమెల్లన్ సుమనోహరంబు లయి యెం
తే సోఁకుచుండంగ ని
మ్ముల నశ్వంబులు పగ్గముల్ వెనుకకున్
మోపెట్టుచున్ లాగినన్

నిలువంబోక మఱింతవేగమున ని
ర్నిద్రంబుగాఁ బాఱెడిన్. ౮

లక్ష్మ:-సుమంత్రా! ఈతురంగములు వాయువేగములై యనాలక్షితసమవిషమప్రదేశములై యీస్యందనమును గంగాప్రపాతమునఁ గూలఁద్రోయఁగలవు. సర్వథా రథమాఁప యత్నింపుము.

సుమం:-(రజ్జువుల నాకర్షించును.)

లక్ష్మ:-ఇచట రథ మాఁగినది. దేవీ! అవతరింపుము.

సీత:-(దిగి పరిక్రమించును.)

లక్ష్మ:-సుమంత్రా! దీర్ఘమార్గపరిశ్రాంతములైనయీతురంగమములకు విశ్రాంతి నిమ్ము.

సుమం:-చిత్తము. దేవా! (రథ మధిరోహించి నిష్క్రమించును.)

లక్ష్మ:- (పరిక్రమించి యాత్మగతమున) ఆర్యులు—కాదు. నా స్వామి నన్నుం జూచి "వత్సా! లక్ష్మణా! రావణభవనసంస్థ యగుసీతచారిత్రమున సముత్పన్నవిమర్శలయి పౌరజను లన్యవిధములఁ బ్రలాపించుచున్నారు. ఒక్కసీతాదేవిమాత్రమునకు శరచ్చంద్రనిర్మల మగు నిక్ష్వాకుకులమునకుఁ గళంక మాపాదింపఁజాలము. గర్భిణీభావసులభ మగుదోహదమున భాగీరథీదర్శన మామె నన్నుఁ గోరి యున్నది. కావున, గంగాగమనవ్యాజమున సుమంత్రాధిష్ఠిత మగు రథము నెక్కించి యేదేనొకవనమున నామెను దిగవిడిచి ర" మ్మని యాజ్ఞాపించిరిగదా! ఆకారణమున నేను గృహహారి

జేసి వధ్యభూమి కీడ్చుకొనిపోవునట్లు దేవి నీగహనము నకుఁ గొనివచ్చితిని.

సీత:-వత్సా! లక్ష్మణా! నెలలు నిండిన చూలాలను. ఈ గర్భభారమున నా కడుగు పడుట లేదు. నీవు ముందేఁగి భగవతి భాగీరథి యెంతదవ్వునఁ గలదో కని వచ్చి చెప్పుము.

లక్ష్మ:-భగవతి భాగీరథి చేరువనే యున్నది. విషాద మంద కుము. అదిగో! అదే! దగ్గఱకు వచ్చినాము. దేవీ:

చ. కమలవనంబునుండి మధు
గంధము నంది, నితాంతమాధురీ
విమలమరాళరాజరుతి
విస్తృతిఁ గైకొని, శైత్యసంపదన్
గొమరుగఁ దాల్చుతుంపరల
కూర్మి గడించినగాంగవాయు బృం
దము లెదురేఁగుదెంచెడు ను
దారవిధిన్ నిను సత్కరింప నాన్. ౫

సీత:- (వాయుస్పర్శసుఖ మనుభవించుచు) ఆహా! కన్నతల్లిచల్లని చేయి సోఁకఁగనే కలుగునంతటిమహాసుఖ మీగంగమ్మ కరళ్లమీఁదనుండి వచ్చులేగాలులు సోఁకుటచేఁ గలిగి యది నాబడలికనేకాదు పాపమును బాపఁగల్గినది. ఐనను, దోహదకౌతూహలము గంగావగాహామునకు సముత్సహింపఁజేయుచున్నది. కావున, నీతటప్రపా తముఁ గాక యపరిశ్రాంతావతరణయోగ్య మగుత్రోవఁ జూపుము.

లక్ష్మ:-(నిర్దేశించి) ఈతటప్రదేశము లత్యంతవిశ్రాంతమనుష్య సంచారము లగుటచే మరవతారము లై యున్నవి. కావున, గాలివ్రేళ్లను నేలకు గ్రుచ్చిపట్టి:

గీ. వామకరమునఁ బట్టి నీవారలతను
దక్షిణకరంబునన్ జంఘఁ దగఁ గ్రహించి
నాయడుగులందు మెలమెల్ల నీయడుగుల
నిడుచు గమియింపు క్షణమాత్ర మిట్లు తల్లి! ౬

సీత:- (అట్లు చేసి) వత్సా! మిగులఁ బరిశ్రాంతి నందితిని. ఈ పాదపచ్ఛాయను ముహూర్తమాత్ర మాఁగి విశ్రమించెదను.

లక్ష్మ:-నీయభిరుచి దేవీ!

సీత:-(కూర్చుండి విశ్రాంతి నందుచుండును.)

లక్ష్మ:-ఆహా! సుకృతులకుఁ బరిజను లెచ్చటను లోపింపరు గదా!

ఉ. శీతలవాయువుల్ విసరి
సేదలు దీర్చుఁ దరంగపంక్తి; వి
ఖ్యాతరసార్ద్రగానముల
హంసలు వీనులవిందు సేయు; సం
ప్రీతిఁ గవుంగిలింత సఖి
రీతి సుఖింపఁగఁ జేయు ఛాయ; యీ
పూతచరిత్ర కిట్లు వన
భూమినిసైతము దాసు లబ్బిరా! ౭

సీత:-కుమారా! నిజముగా నాహృదయము స్వజనమధ్యమున నున్నట్లే మిగుల నానందించుచున్నది.

లక్ష్మ:- (తనలో) దేవి శ్రమము దీఱి సుఖోపవిష్టురాలై యున్నది. యథాస్థితి విన్నవించుట కిదే యదను. (తటాలున సీత పాదములపైఁ బడి ప్రకాశముగా) అనవరత ప్రవాసదుఃఖభాగుఁడు నిర్లక్షణుఁడు నగులక్ష్మణుఁ డిదే విజ్ఞాపనము చేయుచున్నాఁడు. హృదయము దిటవు పఱచుకొనుము తల్లీ!

సీత:-(సంభ్రమముతో) ఆర్యపుత్త్రునకుఁ గుశలమేకదా!

లక్ష్మ:-(వనమును నిర్దేశించి) ఈగతి కల్గఁగా నార్యున కిఁక నేమి కుశలము?

సీత:-ఆర్య కైకేయీదేవి పునర్వనవాస మాజ్ఞాపించినదా యేమి?

లక్ష్మ:-ఆదేశించినది వనవాసమే. కాని, కైక కాదు.

సీత:-మఱి యెవరు?

లక్ష్మ:-(బాష్పధారల నాఁపుకొనుచు)

గీ. ఆర్యునాదేశమే యిది యంబ! యనుచుఁ
బలుకఁగోరుదు; యత్నించి పలుకఁ జూతుఁ;
గాని, వాణి నాహృదయంబులోనఁ జొచ్చి
బలిమిఁ జేసెను నాకు వాగ్బంధనంబు.

సీత:-నాకు వనవాసమే యార్యునాదేశమా?

లక్ష్మ:-కేవలము నీకే కాదు. తనకును.

సీత:-అది యెట్లు?

లక్ష్మ:-

గీ. స్వగృహాభావన బహుసుహృజ్జనులు స్వేచ్ఛఁ
దృప్తి సలరంగ; యాగాగ్ని తేజరిల్ల;
రమ్యభవనవాసమె యైన రాముని కది
త్వత్ప్రవాసముచే వనవాసమె కద!

సీత:-వత్సా! విస్పష్టముగాఁ బలుకుము. ఆర్యపుత్త్రునకు వన
వాస మేమి? నా కిప్పుడు వనవాస మేమి?

లక్ష్మ:-అంతకన్న నే మున్నది? మందభాగ్యుఁడను బలుకు
చున్నాను:

చ. చరితముచేత విశ్వజన
సంస్తుతి గాంచినపుణ్యుఁడున్ గులా
భరణము రాముఁడే నినుఁ బ్ర
వాసముగా వనభూమిలోనఁ జె
చ్చెరఁ ద్యజియించి రమ్మనుచుఁ
జేసె నమోఘపుటాజ్ఞ నాకు నే
నరుగుదు ని న్నిటన్ విడిచి
యంబరో! కావు మహాపరాధమున్. ౧౦

సీత:-హా! తాత! ఆర్య! కోసలాధిప! నీవు మరణించిన
దిప్పుడే! (మూర్ఛిల్లును.)

లక్ష్మ:-(సంభ్రమముతో) అయ్యో! కష్టము! కష్టము! నిర్ఘాత
పాతదారుణ మగుపరిత్యాగవార్తను వినుటవలన దేవి
నిజముగా మరణించినది. (పరిశీలించి కాంచి) అదృష్టవశ
మున నింకను శ్వాసించుచున్నది. ప్రత్యానయనమున

కుపాయ మూహించెదను. (యోచించి) ఆశ్చర్య మాశ్చ
ర్యము!

గీ. పరమగాంగతుషారశీకరపవిత్ర
మృదులవాయుసంభావ్యత, నదియుఁ గాక
నాదు భాగ్యశేషమున జనకజ బోధ్య
మానయై యెట్లొ చైతన్య మూనె మరల. ౧౧

సీత:-వత్సా! లక్ష్మణా! వెడలిపోయితివా?

లక్ష్మ:-తల్లీ! ఆజ్ఞాపింపుము. మందభాగ్యుఁడ నిటనే యుంటిని.

సీత:-న న్నుపాలంభించి పరిత్యజించెనా?

లక్ష్మ:-దేవీ! నీకు నుపాలంభన ముండునా?

సీత:-అయ్యో! నే నెంతటియధన్యను? ఏమాత్ర ముపాలంభ
నము లేకుండనే నిగృహీత నైతినిగదా! నా కేమే
నార్యసందేశ మున్నదా?

లక్ష్మ:-ఉన్నది.

సీత:-చెప్పుము, చెప్పుము.

లక్ష్మ:-"చ. అనుగుణ వంచుఁ దుల్య మగు
నన్వయముం గలదాన వంచు నీ
యనుపమసద్గుణోన్నతి సు
ఖాదుల దుఃఖములందు నెప్పుడుం
నను విడనాడవం చెఱిఁగి
నన్ జనవాదభయాకులుండనై
నిను విడనాడినాఁడఁ దరు
ణీ! యొకదోషము లేదు నీయెడన్." ౧౨

ఇదియే యార్యసందేశము.

సీత:-ఆజనవాదభీతి యేమి? నన్నుఁ గూర్చినదూషణ మేమైనఁ గలదా?

లక్ష్మ:-దేవీ! నీకు నొకదూషణ ముండునా? నీవు:

మ. పరమర్షీంద్రులు లోకపాలురును భూ
పాలుండు నే నుండఁగాఁ
బరిశుద్ధిం గని హవ్యవాహనుఁడు సం
భావింప విఖ్యాతితో
సరుదేరన్ గనెఁగా జగత్త్రియము నా
హ్లాదంబునం గాని..."

సీత:- (లజ్జతో) చెప్పుము, చెప్పుము. కాని...

లక్ష్మ:- ..., ఈ
కరుణాశూన్యనిరంకుశప్రజకు శం
కాగ్రంథి నిల్చెం గటా! ౧౩

సీత:-అగ్నిశుద్ధిసంకీర్తనముచేత నాపూర్వగాథ తలఁపునకువచ్చుచున్నది. రావణభవనోదంతము తిరిగి బాధించుచున్నది. అట్టిసందర్భమునను సీతానామస్మరణము కలిగిన దనుట నిజముగా మహిళాత్వమున కొకపెద్దనింద... ఇట్లు పరిత్యక్తనైతిని...నిజముగా నేను పరిత్యక్తనైతినా? ఆర్యపుత్త్రపరిత్యక్త నగునేను నన్నేల పరిత్యజించుకొనరాదు? కాదు. తన్నిరనుక్రోశునకు సదృశమైనయీప్రసవమును రక్షించుకొఱకుఁ బరివాదకంటకోపహత మగునీజీవితమును బరిరక్షింతును.

లక్ష్మ:-అనుగ్రహించితివి సాధ్వీ! (నిలిచి నమస్కరించును.) మఱియొకయార్యసందేశము!

సీత:-అది యేమి ?

లక్ష్మ:-

"శా. నీవే నాహృదయాధిదేవత వికన్
నిత్యంబు, నాశయ్యపై
నీవే స్వప్నములందునైన సుఖసా
న్నిధ్యంబుఁ గల్పించె దో
దేవీ! కైకొన సవ్యదార నిక భ్రాం
తిన్, యజ్ఞయాగాదులన్
నీవిశ్వాద్భుతరూపపుంప్రతిమయే
నేఁ గొందు నాపత్నిగాన్." ౧౮

సీత:-దీనివలన నార్యపుత్త్రపరిత్యాగదుఃఖము నిరవశేషముగాఁ దొలఁగినది. అన్యాసక్తుఁ డగుపతివలన సతికిఁ గలుగు దుఃఖ మన్యాసక్త యగునాతివలనఁ బతికిఁ గలుగదు.

లక్ష్మ:-ప్రతిసందేశ మేమి ?

సీత:-ఎవరికి ?

లక్ష్మ:-ఆర్యునకు.

సీత:-ఈగతిలో నాప్రతిసందేశమా ? ఐన, నాయత్తలకు నావచనముగఁ బాదాభివందన మొనరించి యిట్లనుము. "ఇటులు రక్షాశూన్యనై శ్వాపదసమాకీర్ణ మగువనమున నున్నను నన్ను సర్వదా యార్య లగుమీరు మీహృదయముల ననుగ్రహింతురుగాక !"

లక్ష్మ:- ఈయాజ్ఞను శిరసా గ్రహించితిని. ఆర్యపుత్రునకేమైన సందేశ మున్నదా ?

సీత:- ఆనిష్ఠురహృదయునకు సందేశ మిచ్చుట నీయప్రతిహత వచనమునకే కాని సీతాధన్యత్వమునం గాదు. లక్ష్మణా! ఆజనపాలునకు నావచనముగా నిట్లు నివేదింపుము: "మందభాగ్య నగునన్ను గుఱించి యనుశోచించుచు వర్ణాశ్రమధర్మపరిపాలన ముజ్జగించి యాత్మను బాధించు కొనవలదు. సద్ధర్మస్వశరీరములపట్ల సావధానత వల యును..." వత్సా! లక్ష్మణా! నేను జనపాలు నేమైన నిందించితినా ?

లక్ష్మ:- దేవీ! ఈమాత్ర మనుట కనర్హావు గావుకదా !

సీత:- ఈసంగతికూడ వారికి నివేదింపుము: "నిరపరాధ, హృదయావర్జిత, యగునీమెను జనపదమునుండి వెడల నడచుట యుక్తమా?"

లక్ష్మ:- ఆర్యా! చెప్పందగినసందేశమే చెప్పితివి. కాని :

చ. తనహృదయంబునుండి వసు
ధావరుఁడున్ నిను వీడియుండుటే
మనమునఁ దోఁచు; లేనియెడ
మాతరో! నిన్ను గృహంబునుండి తా
నసుపఁగ నేల ? యయ్యయొ ! గృ
హంబుననుండియుఁ గాదు, కాక యా
జనపదమందునుండియును
సాగఁగ నంపఁగ నేల నేఁ డిటుల్. ౧౭

సీత:-ఈసంగతికూడ శ్రీమహారాజులతో నావచనముగా విన్నవింపుము: "తపోవనవాసిని సీమంతనిహితాంజలి యగు సీత నిర్గుణ యనికాని చిరపరిచిత యనికాని యనాథ యనికాని సీత యనికాని స్మరణమాత్రముననైన నను గ్రహింప వేడుకొన్నది."

లక్ష్మ:-

శా. ఈసందేశము విన్నయంతటను దే
వీ! రామచంద్రుండు నా
కేసందేహము లేదు మున్గి పడు నెం
తే దుఃఖవారాన్నిధిన్
గాసం బైతెనక్షతంబునందు మిగులన్
క్షారంబు దట్టించిన
ట్లై సర్వాత్మకుఁ డయ్యు వ్యక్తముగ నే
యందున్ మహాపద్దశన్. ౧౬

సీత:—దుఃఖసమయమున సతిమహితస్వమండల మున్న నుండ వచ్చునుగాని, శోకాపనోదను లగుస్త్రీజను లెట్లు లభింతురు? నేనిట నున్నసమయమున నట నీవే యాతని నరయుచుండవలయును. మఱి, భ్రాతృశరీరస్వాస్థ్యము నీవు తప్పక కనుచుండవలయుఁజుమా!

లక్ష్మ:—తల్లీ! నీమహానుభావత కిదియే యనురూపము.

సీత:—వత్సా! లక్ష్మణా! నీవు నాకు బదులుగా రాఘవకుల రాజధాని భగవతి యయోధ్యకు నమస్కరింపుము. ప్రతినూాగతు లగుమహారాజులకు శుశ్రూష లోన

రింపుము. ప్రియంవద లగునాసఖుల నాశ్వాసింపుము. సర్వకాలములందును మందభాగ్య నగునన్ను స్మరింపుము. (దుఃఖించును)

లక్ష్మ:-(ఉద్వేగముతో)

చ. కటకట! కన్నతల్లి యనఁ
గాఁ దగుసాధ్విని జేతులార నే
నిటులు పరిత్యజించుటకు
నింతటిదుఃఖముఁ గాంచఁగంటకున్
బటుతర రామరావణర
ణంబున ఘోరపుమూర్ఛ మున్గున
న్నటు బ్రదికించినట్టిపవ
నాత్మజుఁ డెంతటి ఘోరశత్రువో! ౧౨

(విలోకించి)

ఉ. పచ్చిక మాని యీహరిణ
వారముసైతము నేడ్చు మిక్కిలిన్;
మచ్చికచూపుహంసము ల
మందగతిన్ విలపించుచుండె; నేఁ
డిచ్చట నృత్యముల్ మఱచి
యెంతయు జాలి నెమిళ్లుఁ జేరె యీ
సచ్చరితన్ గనన్; మనుజ
సంతతికంటెఁ బసుల్ మెఱుంగెయకా! ౧౩

సీత:- వత్సా! లక్ష్మణా! సూర్యాస్తమయ మగుచున్నది. మనుష్యసంచారమే దూరమైనది. పక్షు లెగిరిపోయి

అది యేమి ?

నీవే నాహృదయాధిదేవత వికన్
నిత్యంబు, నాశయ్యపై
నీవే స్వప్నములందునైన సుఖసా
న్నిధ్యంబుఁ గల్పించెదో
దేవీ! కైకొన నవ్యదార నిఁక భ్రాం
తిన్, యజ్ఞయాగాదులన్
నీవిశ్వాద్భుతరూపపుంబ్రతిమయే
నేఁ గొందు నాపత్నిగాన్." ౧౮

దీనివలన నార్యపుత్త్రపరిత్యాగదుఃఖము నిరవశేషముగాఁ దొలఁగినది. అన్యాసక్తుఁ డగుపతివలన సతికిఁ గలుగు దుఃఖ మన్యాసక్త యగునాతివలనఁ బతికిఁ గలుగదు.

ప్రతిసందేశ మేమి ?

ఎవరికి ?

ఆర్యునకు.

ఈగతిలో నాప్రతిసందేశమా ? ఐన, నాయత్తలకు నావచనముగఁ బాదాభివందన మొనరించి యిట్లనుము. "ఇటులు రక్షాశూన్యనై శ్వాపదసమాకీర్ణ మగువనమున నున్నను నన్ను సర్వదా యార్య లగుమీరు మీహృదయముల ననుగ్రహింతురుగాక !"

వరమీవే క్షమియింప దోషలవముల్
దల్లీ! నినుఁ వేఁడెదన్. ౨౦

సీత:-(సంభ్రమముతో) గురుభ్రాతృవచనానువర్తి వగుట నీ కీ సంతోషకాలమున దోషారోపణ మేల?

లక్ష్మ:-(సప్రదక్షిణముగా నమస్కరించి పరిక్రమించును.)

సీత:-(రోదనము చేయును.)

లక్ష్మ:-(దిశ లవలోకించి) ఓహో! లోకపాలకులారా! ఆకర్ణింపుఁడు:

శా. సాధ్వీరత్నము సీత యాదశరథ
క్ష్మాభర్తకుఁ గోడలౌ ;

సీత:-అతిశ్లాఘనీయము లగునక్షరములు వినఁబడుచున్నవి.

లక్ష్మ:-

పృథ్వీమాత కనుంగుబిడ్డ; సతియౌ
శ్రీరామభూభర్తకున్

సీత:-నా కాయదృష్ట మెట్టులు ?

లక్ష్మ:-

పృథ్వీభర్త ప్రవాసముం బనిపె; నీ

సీత:-(చెవులు మూసికొనును)

లక్ష్మ:-

భీతాత్మ నేకాకినిన్
సాధ్విం బ్రోవఁగ రండు కం డతిదయన్
సాహాయ్య మత్యంతమున్. ౨౧

సీత:-(గర్భమును జూపును.)

లక్ష్మి:- దేవీరక్షణకు భాగీరథ్యాదుల కిట్లు విన్నవించెను :

మ. శ్రమముం గన్న సతీవతంసము పవి
త్రం బౌభవద్వీచులన్
గమలంబుల్ వెదచల్లుగంధముల నా
ఘ్రాణింపఁగా వీచి స్నా
నముచేయం జనుదేర నీజలములన్
దల్లీ! భవద్వేగమున్
క్షమ నాఁపన్ వలయున్ క్షణంబు దయ ర
క్షాస్తుత్య భాగీరథీ! ౨౨

చ. పరమపవిత్ర యంచుఁ దన
వంశముఁ బాసిన దంచు రక్షకున్
గరుణకుఁ బాత్ర యంచు వర
నారియు నుజ్ఝిత యంచు మీకు నా
కరములు మోడ్చి మ్రొక్కి పలు
కంగల విన్నప మీవనస్థులా
పరమమునీంద్రులార! కృప
భామను బ్రోవఁగఁ గన్నతండ్రులై. ౨౩

మ. నిదురం గన్నను మేలుకొన్నఁ గడు సం
దిగ్ధస్థితిన్ మన్న నా
పదయం దున్నఁ బ్రమాద మన్న భయవి
భ్రాంతాత్మఁ గైకొన్న నో
సదయానంతరసార్ద్రులార! వనరా
జ్యం బేలుపుణ్యాత్ములా

ర! దయన్ బ్రోవుఁడు సాధ్వి నేమఱకుఁడీ
ప్రార్థింతుఁ గేల్మోడ్చుచున్. ౨౪

మ. క్షణమాత్రంబును నిల్వరా దిచట హిం
సాజీవులారా! విల
క్షణచిత్తుల్ మఱి యెవ్వ రన్యు లిటఁ ద్రొ
క్కన్ రాదు పో పొందు; మీ
రణుమాత్రంబును జాగుసేయకుఁడు వి
ప్రవాససేవామహా
గుణు లో యేణములార! నెచ్చెలియ మీ
కున్ సీత సేవింపుఁడీ! ౨౫

మ. చెలు లౌచున్ నదులార! స్వామి లయి ది
క్సీమాధిపుల్! ప్రీతి భ్రా
తలు మీరై గిరులార! తల్లి వయి మా
తా! జాహ్నవీ! కావుఁడీ!
పలుమాఱుల్ సతి సల్పుదున్ మఱియు సం
ప్రార్థింతు సీతాసతీ
తిలకంబున్ దయచూడుఁ డేమఱకుఁ డిం
తిన్, బోయి నే వచ్చెదన్. ౨౬

(ప్రణుతించి నిష్క్రమించును.)

సీత:-ఏమి ? న న్నొంటిపాటున విడిచి నిజముగా లక్ష్మణుఁడు వెడలి పోయెనా? (చూచి) అయ్యో! ప్రొద్దు గ్రుంకినది. లక్ష్మణునిస్వర మైనను వినవచ్చుట లేదు. హరిణములు తమ యావాసముల కేఁగుచున్నవి. పక్షులు గూండ్లను జేరు

చున్నవి. శ్వాపదములు సంచరించుచున్నవి. అంధకారము దృష్టిని బంధించుచున్నది. మహారణ్యము నిర్మానుష్య మైనది. మందభాగ్యురాలను నేనేమి చేయుదును? ఒంటరి కత్తె నెట్లీకాఱడవిఁ దిరుగుదును? ... నే నెట్టిపాపము చేసికొంటినో! ఈవిధమున నీఘోరవిరహము ననుభవించు చున్నాను. ఎట్లు...లక్ష్మణనియుక్త లగువనదేవతలు... ఎట్లు? రాఘవకులక్రమాగతు లగువసిష్ఠవాల్మీకి ప్రము ఖులు మహాప్రభావు లగుమహర్షులు నన్నిపుడు పరిత్య జించి...(మూర్ఛిల్లును.)

(అపుడు వాల్మీకి ప్రవేశించును.)

వాల్మీ:-(సంభ్రమముతో)

శా. సాయంసంధ్య జలావగాహనవిధిన్
సల్పంగ భాగీరథిన్
ధీయుక్తుల్ మునిబాలకుల్ చని మహా
ర్తిం గుందుచున్ దావ్యాద
శ్రీయుక్తాత్మయు నొంటికత్తెయును నై
చింతించుస్త్రీఁ గాంచుటన్
నాయందుఁ వినిపింప వచ్చితిఁ ద్వరన్
సాధ్విం గనన్ బ్రోవనున్. ౨౭

కావున, నే నామె నన్వేషించెదను. (వెడలును. )

సీత:-(తెలివినంది)ఈతఁ డెవఁడో నన్నుఁ జూచుచున్నాఁడు. (చింతించి) ఎవరును లేరు. భగవతి భాగీరథి లక్ష్మణుని విన్నపము ననుసరించి తనతరంగముల న న్ననుగ్రహించు చున్నది.

వాల్మీ:-ఈయంధకారబంధురతఁ గన్నులు గానరాకున్నవి. కావునఁ, బిలిచెదను. ఇదిగో! నేనహో!

సీత:-(ఆనందముతో) వత్సా! లక్ష్మణా! మరల వచ్చితివా?

వాల్మీ:-నేను లక్ష్మణుఁడను గాను.

సీత:-(మేలిముసుఁగు ధరించి) అయ్యో! కష్టము! కష్టము! వీఁ డెవఁడో పరపురుషుఁడు. వీని నెట్లు వారింపఁగలుగుదునో! మహాకష్టము! (విచారించి) సరే! నే నేకాకి నగుస్త్రీని.

వాల్మీ:-ఐన, నే నున్నాను. వత్సా! నీకుఁ బరపురుషశంక వలదు. దివసావసానసవనార్థమై భాగీరథికి వచ్చి మునిబాలకులు నీసంగతి తెలుపఁ దపోధనుఁడ నగు నేను నిన్ను వెదకుచు వచ్చితిని. ని న్నొకటి యడిగెదను. చెప్పుము:

ఉ. ధర్మముచేత యుద్ధమునఁ
డా గెలుపొందినరామచంద్రుఁ డా
నిర్మలచారుమూర్తి ధర
ణీతల మేలుచుఁ బెంపుసేయ నే
కర్మవిపాక మమ్మ! కడుఁ
గష్టము గాంచితి చెప్పు చెప్పు మే
మర్మము దాఁచకుండ నిట
మాకును నీదగుదుఃఖహేతువున్. ౨౮

సీత:-ఆతఁడే నాదుఃఖహేతువు. పూర్ణచంద్రునుండియే యశనిపాతము.

వాల్మీ:-ఏమి? రామునివలననేనా నీ కీమహాకష్టము?

సీత:-చిత్తము.

వాల్మీ:-వర్ణాశ్రమధర్మవ్యవస్థాభూతుఁడైన శ్రీరామునిచేతనే నీవు నిర్వాసిత వైనచో నీకు స్వస్తి. నే నేఁగెదను.
(పరిక్రమించును.)

సీత:-ఒక్కవిజ్ఞాపనము.

వాల్మీ:-ఏమది ?

సీత:-రఘువరనిర్వాసిత నని నేను దమ కనుకంపనీయను గాకపోవచ్చును. కాని, నాయీగర్భగతసంతానము తాదృశు లగు సగరదిలీపరఘుదశరథప్రభృతుల దనియైనఁ గరుణామయులై నన్నుఁ గాపాడవలయును.

వాల్మీ:-(వెను దిరిగి) ఏమి ! ఇక్ష్వాకువంశ ముదాహరించుచున్నది! ఆసంగతి తెలిసికొందును. వత్సా ! నీవు దశరథుని కోడలివా ?

సీత:-చిత్తము. ఆజ్ఞాపింపుఁడు.

వాల్మీ:-మఱియు విదేహాధిపతి యగుజనకునిదుహితవా ?

సీత:-చిత్తము.

వాల్మీ:-మఱియు సీతవా ?

సీత:-భగవానుఁడా ! సీతను గాను. మందభాగ్యురాలను.

వాల్మీ:-హా ! హతోస్మి. మందభాగ్యుఁడను. ప్రాసాదతలము నుండి నీ కీయధఃపతన మెట్లు కలిగినది? తల్లీ !

సీత:-(సిగ్గుపడును.)

వాల్మీ:-ఏమి ? లజ్జించుచుంటివా ? కానిమ్ము. యోగచక్షువులచే నవలోకింతును. (ధ్యానించి) వత్సా ! రాముఁడు కేవలము జనాపవాదభీతిచేతనే నిన్నుఁ బరిత్యజించినాఁడు. కాని, హృదయముచేఁ గాదు. నిరపరాధ వగు

నిన్ను మేము పరిత్యజింపము. ఆశ్రమపదమునకు
రమ్ము. పోదము.

సీత:-తా మెవరు?

వాల్మీ:-వినుము:

గీ. జనకరాజర్షి కేఁ జిరంతనసఖుండ
దశరథుని బాల్యమిత్త్రిరత్నంబ నేను
నతివ! తండ్రియు మామయు నాదు నింక
నీకుఁ; దెలియుము నన్ను వాల్మీకిఁ గాఁగ.

సీత:-భగవానుఁడా! వందనములు.

వాల్మీ:-వీరప్రసవ వౌదువుగాక! భర్తృపునర్దర్శన మగుఁగాక!

సీత:-తాము లోకమునకు వాల్మీకులు. నాకుఁ దండ్రులు.
ఆశ్రమపదమున కరుగుదము. (గంగ కంజలించి) భగవతీ!
భాగీరథీ! నీదయచే నేను సుఖప్రసవనైతినా, దినదినము
నీ కొకకుందమాలోపహార మొసంగుదును.

వాల్మీ:-ఈమార్గ మత్యంతదుఃఖసంచారము. మఱియు, నీకు
విశేషకష్టదము. అందుచే, నేను నడచిన మార్గముననే
నడచి రమ్ము.

చ. ఇవి కుశకంటకంబులు స
తీ! పదముల్ కడుఁ దేల్చి వేయు మి
య్యవి కను నమ్రశాఖ లిట
నంతట ముందట వంగి నిల్వు మ
య్యవతలివంక స్థాణు వది
యం దొకగొయ్యి గమింపు మిట్టు లీ

యువతులఁ బద్మపుంగొలను
నిండారసికింపు పద్మాక్షసేచనన్. ౩౦

సీత:-(అట్లు చేయును)

వాల్మీ:-(నిర్దేశించి)

గీ. పడఁతి! సీమంతమును బుంసవనము నాది
విధివిహిత మైనకర్మంపువితతి మేమె
యెల్ల యిక్ష్వాకులకుఁ జేసి యొసఁగినార
ముమ్మలింపకు మమ్మ గర్భమ్ముఁగూర్చి. ౩౧

శా. కౌసల్యాపదసేవచేత నగుసౌ
ఖ్యం బాశ్రమస్థానవృ
ద్ధాసింసేవలచే నగున్; మఱియు ని
త్యంబున్ నినుం గొల్చుచున్
నీ సాంగత్యముఁ గాంచునెచ్చెలియలున్
నీయొక్కతోఁబుట్టువుల్
ఓసాధ్వీ! మునికన్యలే యగుచు నెం
తో ప్రీతితో నుంద్రిఁకన్. ౩౨

(నిష్క్రమింతురు)

ప్రథమాంకము సమాప్తము.

ఓం

శ్రీగురుభ్యో నమః

# కుందమాల

(ప్రవేశకము 1*)

(ఇరువురుమునికన్యలు ప్రవేశింతురు.)

ప్రథమ:-చెలీ! వేదవతీ! నీయదృష్టము మంచిది. నీప్రియసఖి యగుసీతకు రామశ్యామలు లగునిరువురుకవలపిల్లలు జన్మించిరి.

వేద:-ప్రియము! ప్రియము! సఖీ! వారినామధేయము లేవి?

ప్రథమ:-జ్యేష్ఠుఁడు కుశుఁడు. ద్వితీయుఁడు లవుఁడు. ఇవి వాల్మీకు లిడిన పేళ్లు.

వేద:-ఏమే చెలీ! వారు తప్పటడుగు లైన నిడ నేర్చిరా?

ప్రథమ:-ఇంకను దప్పటడుగులేనా?

గీ. హరిణకంబులతోఁ గూడ నరిగి పరుగు
లిడుచునుందురు; ప్రతిమల్లు లింతవారె
హరికిశోరములకు; నాశ్రమాస్థిత లగు
మునిసతుల కెల్ల ముద్దులమూటలుగద! ౧

మునిజనములుసైత మీముద్దుబిడ్డలను జంక దింపరు. వీ రిప్పుడు వాల్మీకిభగవానులరామాయణముఁ బఠించుచున్నారు.

---

* 'భవేదంకబహిర్భావో విష్కంభే చ ప్రవేశకే' (చూ. ప్రతాపరుద్రీయము ౯౨ పుట.)

వేద:-ఈసంగతి వినఁగా సీత పుణ్యాత్మురా లని యనుకొను చున్నాను...అన్యోన్యస్నిగ్ధములు.

ప్రథమ:-అది మఱింతయధికము గావలయును. నైమిశారణ్య వృత్తాంత మేమైనఁ దెలిసినదా?

వేద:-తెలియకేమి! మహారాజు చేయుయజ్ఞమునకు సకల సంభారములుఁ జేకూరినవి. తపోజను లందఱును సపత్నీకులై రావలయు నని పిలుపులు వెళ్లినవి.

ప్రథమ:-మనవాల్మీకిభగవానుని బిల్చిరా?

వేద:-ఆ, వాల్మీక్యాశ్రమమునకును రామదూత వచ్చె నని వింటిని. సీత యెచ్చట నున్నదో యొకసారి చూడ వలయును.

ప్రథమ:- అచ్చటనే యూసాలవృక్షచ్ఛాయఁ గూర్చుండి యున్నది. పోవుదమా?

(నిష్క్రమింతురు.)

ఇది ప్రవేశకము.

శ్రీగురుభ్యో నమః

# కుందమాల

## ద్వితీయాంకము.

(అంతఁ జింతాకులయై ఘనవ్యాసనమునఁ గూర్చుండి సీత ప్రవేశించును.)

సీత:-(నిట్టూర్చి) ఆహా! ప్రకృతివిస్మరభావములు గలపురుష హృదయము లవిశ్వసనీయములు. శిలాక్షరములుగా లిఖింపవలసినదంపతుల ప్రసంగములసందర్భమున దివియం దుమామహేశ్వరులవలె భువియందు సీతారాముల కతిప్రసిద్ధి నొసంగినవారే నిరపరాధనగు న న్నీదురవస్థకుఁ బాలుగావించిరి గదా! నే నార్యపుత్త్రు నెట్లు నిందింతును? వెనుకటినాయార్యపుత్త్రునితో... ఇపుడు బహుయోజనాంతరితనై ...అకారణముగ... పూర్ణదుఃఖకారిణినైతినే! ఆతనితో నుండి చంద్రోదయము గాంచెడిదానను. ఆతనితో నుండి కోకిలకలప్రలాపము లాలించెడిదానను. ఆతనితో నుండి మలయమారుతస్పర్శ మనుభవించెడిదానను... ఇపు డొంటరికత్తెనై కనుచు వినుచు ననుభవించుచున్నాను. నావంటిస్త్రీలు ప్రాణత్యాగము చేయు టేవిధమునను మంచిది కాదు. అపుడు భర్తతోఁ గూడియుండ సకలమిథిలాపుర ప్రజలప్రార్థనమునకుఁ బాత్రురాలనై యిపు డీదురవస్థకుఁ బాల్పడితినిగదా యన్న సిగ్గుచేటే యార్యపతిత్యాగదుఃఖముకన్న మఱింత బాధాకరమైనది... ఇపు డిద్దఱుసుతులు కలిగి వర్ధిల్లు

చున్నారు. వాల్మీకిభగవానుఁడు సాదరుఁడై యున్నాఁడు. కావున, తపోవనవాసవిరుద్ధముగ దీర్ఘనిశ్వాసములతోఁ గాలముగడపు టయుక్తము. పోనీ, మరణోద్యుక్తనైనను నన్నుఁ బ్రియసఖి యగు వేదవతికి నివేదింపనే లేదు. వర్తమానమైనఁ బంపలేదు. ఇది ప్రతిబంధకముగదా!

(అంత వేదవతి ప్రవేశించును.)

వేద:-తపోధనులకు వందనోపచారములును నతిథిజనులకు సముచితసముదాచారము నైనవి. ఇఁక, సీసాలవృక్షము సమీపించి ప్రియసఖిని సంభావించెదను. (పరిక్రమించి విలోకించి) ఇదే విదేహరాజతనయ. నిదాఘమానలతవలెఁ బరిక్షామపాండురావస్థఁ గని, హృదయముఁ గుదురుపఱచుకొనుచు సాలమూల మలంకరించి యున్నది. సమీపించెదను. (చెంత కేఁగి) ఈమె చింతాపరవశయై యధోముఖియై లంబాలకాచ్ఛాదితనయనయై దీనదృష్టి నున్నది. పలుకరింతును. చెలీ! సీతా! (కేక వేయును.)

సీత:-(సంభ్రమముతోఁ జూచి) ప్రియము! ప్రియము! ప్రియసఖి వేదవతి వచ్చినది. స్వాగతము ప్రియసఖీ!

వేద:-కుశలవులకుఁ గుశలమే కదా!

సీత:-వనవాసోచితముగా——

వేద:-నీసంగతి యెట్లున్నది?

సీత:-(వేణిఁజూపి) ఇది యెట్లున్నది?

వేద:-(తనలో) ఈవరాకి యతిమాత్రముగాఁ బరితపించుచున్నది. రఘురామకృతకార్యసంకీర్తనమున నీమె నోదార్చెదను. (ప్రకాశముగా) ఓయవివేకినీ! నిరపేక్షియు నిరనుక్రోశుఁడు

[illegible] కేవిధముగా నసితపక్షచంద్ర
రేఖవలె దినదినమును గృశించెద వేల?

సీత:-ఆతఁడు నిరనుక్రోశుఁ డెట్లగును?

వేద:-నిన్నుఁ బరిత్యజించుటచే.

సీత:-నేను పరిత్యక్తనా?

వేద:-(నవ్వి కేలిని బరిమార్జించి) నీవు నిజముగాఁ బరిత్యక్తవే యని జనులు చెప్పుచున్నారు.

సీత:-ఐనను శరీరముచేఁ గాని హృదయముచేఁ గాదు.

వేద:-పరకీయ మగుహృదయము నీ కెట్లు తెలియును?

సీత:-ఆతనిహృదయము నాకుఁ బరకీయ మెట్లగును?

వేద:-ఏమి యపరిత్యక్తానురాగము!

సీత:-ఆతనిదిమాత్రము పరిత్యక్తానురాగ మెట్లగును? ఈయ భాగ్య నుద్దేశించియే కదా యాతనిజగత్ప్రసిద్ధసేతుబంధన పరిశ్రమము!

వేద:-ఆత్మశ్లాఘినీ! అది క్షత్త్రియసముచిత మగు రావణోపరి రోషమే కాని సీతోపర్యనురాగము కాదు.

సీత:-ఇం కొకవిషయ మున్నది. చూడవా?

వేద:-ఏది?

సీత:-ఇది.

వేద:-ఇది యన నేది?

సీత:-(లజ్జతో) సపత్నీజననిశ్వాసానుపవిద్ధ మగురామవక్షస్థలాతిచిరంతనసంభావనీయత.

వేద:-సఖీ! తొందర వలదు. రామునియజ్ఞదీక్షాసమయ మాసన్న మగుచున్నది.

సీత:-ఏన?

వేద:-అపు డాతఁడు యాగాశ్వమును సహధర్మచారిణీపాణి గృహీతివై విడువవలయును.

సీత:-ఆర్యపుత్త్రునిహస్తమునసే కాదు హృదయమునను నే నుందును.

వేద:-(తనలో) ఆహా! ఏమి యీమెదృఢానురాగము! (ప్రకాశముగా) సఖీ! పుత్త్రముఖదర్శనముచే నైనఁ బ్రవాసదుఃఖ మంతరింపనే లేదా?

సీత:-శోకపరిహారముచేఁ గూడ నాదుఃఖమధికమే యగుచున్నది.

వేద:-ఎట్లు?

సీత:-సుతు లిరువురు నీషత్సముద్భిన్నదశనాంకురవదనములతో నవ్వుచు నావంకఁ జూచి యత్యంతకోమలాలాపముల నన్నుఁ బలుకరించునపు డెల్ల సాదృశ్యమును బట్టి యార్యపుత్త్రసౌందర్యలహరిలో మునిఁగిపోదును. మఱియు, వారు పెరిఁగి పెద్దవా రగుచుఁ గాలక్రమమున బాలభావమును వీడి కేవల మార్యపుత్త్రునివలె నుండుటచే నాకధికతర దుఃఖమే కలుగుచున్నది.

వేద:-అయ్యో! పిల్లలతల్లి యగుసీత యిట్టిమనస్తాప మనుభవించుచుండ నాతనిమహోర్ఘ్ మగున్నృశంసత్వ మెంతటిది!

సీత:-సఖీ! వేదవతీ! ఎన్నటికైన... (సిగ్గుపడును.)

వేద:-సిగ్గుపడకుము. సఖీ! చెప్పుము. ఆర్యపుత్త్రుని జూతునా యనియా?

సీత:-(తనలో) సిగ్గేల? చెప్పెదను. (ప్రకాశముగా) ఎన్నఁటికైనఁ గుశలవపితృదర్శనమహాయోగమున నాజన్మము పండునా?

వేద:—సఖీ రాజదర్శనము త్వరలోనే కలుగును.

సీత:—ఎట్లు ?

(తెరలో ఋషి)

ఓ యాశ్రమవాసులారా ! వినుఁడు. ఈచేరువనే శ్రీ రామమహారాజు మహాక్రతు వగునశ్వమేధయాగము చేయుచున్నాఁడు. యజ్ఞోపకరణము లన్నియు లభించినవి. నానా దేశాశ్రమవాసులు వసిష్ఠాత్రేయప్రభృతిమహామునులు విచ్చేసియున్నారు. వాల్మీకిభగవానునియాగమనము నెదురుచూచుచు శ్రీరాముఁ డింకను యజ్ఞదీక్షను బూనలేదు. వాల్మీక్యాశ్రమ తపోవాసులనిమంత్రణమునకై రామదూత వచ్చినాఁడు. కావున, నాలసింపకుఁడు.

గీ. తీర్థజలములు సమిధలు దీసికొనుచుఁ
బూతదర్భాంకురంబులుఁ బూని రండు
మానులార !; కన్యకలార ! మంగళములు
సలుపుఁ డుటజాంగణంబుల బలు లొసంగి. ౧

సీత:—త్వరపడవలయును. చెలీ ! త్వరపడవలయును. అదిగో ! ఆర్యకాశ్యపుఁడు ప్రస్థానఘోషణానంతరమున యజ్ఞోపకరణములతో సిద్ధమై నిలచినాఁడు. నేనును గుశలవులకుఁ బ్రస్థానమంగళానుష్ఠానము జరుప నేఁగెదను.

(ఇరువురు నిష్క్రమింతురు.)

ద్వితీయాంకము సమాప్తము.

---

(ప్రవేశకము ii)

(నెత్తిని బరువు బెత్తుకొని ప్రయాణముచే నలసినతాపసుఁడు ప్రవేశించును.)

తాప:-(శ్రమముతో) ఈవేసవియెండలవడగాడ్పునకు మిక్కిలి శ్రమ మందితిని. తెగనడచుటచేఁ బిక్కలిటునటు నాడకున్నవి. అఱకాళ్లు పొక్కులెక్కి చిటికి బాధించుచున్నవి. అదికాక. సూర్యాస్తమయమునకు ముందే యంతేసుకు మూరి యగుసీత మఱియుఁ గోమలతను లైనకుశలవులు తాపససమాజముతో నైమిశముఁ జేరినారే! నే నింకను నైమిశాటవీదిశాముఖుఁడ నైనను గాలేదు. (ఆలోచించి) నాకు నైమిశమార్గమును జూపువా రెవరు? (చూచి) ఇదిగో! లక్ష్మణసహాయుఁడై నైమిశమును జేరిన శ్రీ రాముఁడే యీతఁడు గానోపును. కావున, నే సీతని ననుసరించి యేఁగెదను.

(నిష్క్రమించును.)

ఇది ప్రవేశకము.

ఓం

శ్రీగురుభ్యో నమః

# కుందమాల

## తృతీయాంకము.

(అంత లక్ష్మణుఁడు మార్గము చూపుచు ముందును శోకసంతప్తుఁ డగు రాముఁ డాతనివెనుకను బ్రవేశింతురు.)

లక్ష్మ:-ఆర్యా! ఇటు! ఇటు! (పరిక్రమించి)

చ. ప్రథమమునన్ సతీమణికిఁ
బ్రాకృతలోకపుదుష్టమానప
ప్రథ యది గల్గఁగా నిరప
రాధిని ఘోరవనిన్ ద్యజించి యీ
పథమున నేఁడు సుప్రథిత
వంశవిశేషుని రామచంద్రు నే
సథముఁడఁ దెచ్చితిన్; స్వజను
లార్తిని గుందఁగఁ జూచుపాపినై. ౧

ఆహా! ఈక్యము లెంతచక్కనివి:

క. సంపద నడఁచుఁ బ్రమాదము,
చంపుఁగ దర్పాతిశయము సమ్యక్ప్రీతిన్;
జంపు వినయమును వ్యసనము,
చంపుఁగ ధైర్యమును శోకసంగతి యెపుడున్. ౨

మందరమహీధరసమానధైర్యుం డయ్యు నీమహానుభావుండు వాల్మీకులయాగమున ముపలక్షించి వారిదర్శనమునకై గోమతీతీరాశ్రమపదమునకు బయలుదేఱియు, శోకావేగసమాక్షిప్తహృదయుండై యామార్గముం దప్పి మహావనాభిముఖుండై నాండు. నే నిది యాతనికి జ్ఞప్తికిం దెత్తునా? వలదు. ఈప్రతీహారుండు పోవుమార్గముం జూపుదును. అప్పు డచేతనత నున్న నీతండు వాల్మీక్యాశ్రమమునే చేరంగలండు. ఆర్యా! ఇటు! ఇటు!

రాము:-(నిశ్వసించి)

ఉ. ఆకరణిన్ మహాగిరుల
నంబుధిఁ గట్టుట వ్యర్థమయ్యెఁ; సు
శ్లోకశుచిత్వసాక్షి యగు
శుద్ధుని వహ్నిఁ దలంపనైతి; ని
క్ష్వాకుకులప్రసిద్ధదివి
జస్తుతసంతతి నెంచనైతి, నే
మైకమునన్ ద్యజించుటను
మైథిలి; నే మొనరించితిన్? గటా! 3

(పరిక్రమించి) అతినిరాలంబ మైనతపస్విప్రవాస మెంత కష్టము!

శా. ఎవరిం జూచి పతివ్రతామణి యిఁకన్
హింసాత్మ గాకుండు; నె
య్యవి యూహించి మనంబు నెం దునిచి శాం
త్యాశ్వాసముల్ గాంచునో
వివిధాశాస్యము లొక్కపెట్టునఁ గడున్
విధ్వస్తముల్ గాఁగ నే

పవిదిన్ వ్యాళభయాకులం బగువనిన్
బ్రాణంబులన్ నిల్పునో ? ౪

లక్ష్మ:-(తనలో) ఆర్యావిప్రవాసముఁ దనయవైశసముఁ దలఁచి యన్న మిక్కిలి సంతాపించుచున్నాఁడు. అందుచేఁ బ్రస్తావాంతరమున దేవీవృత్తాంతమును మఱపించెదను. (ప్రకాశముగా) ఆర్యా! ఇటు లవలోకింపుము :

చ. మదకలహంసికానివహ
మంజులగీతరవోపకంఠమై
సదమలగారుడప్రథిత
సామ్యహరిన్మధుపూరమై లస
న్మృదునలినీవికాసజని
తేష్టసుగంధసుపూరితంబునై
విదితసుఖాస్పదంబు కని
పించెడుఁ జూడుము గోమతీనదిన్. ౫

రాము:-(స్పర్శసుఖ మనుభవించి)

చ. మలయమరుద్వితానములు
మౌక్తికహారములుం బటీరమున్
లలితనవేందుపాదములు
నాకును సీతఁ ద్యజించుటాదిఁ గాఁ
కలు; మదికిన్ సుఖాస్పదవి
కాసముఁ గూర్చె నదీమరుత్తు; లీ
కెలన వరాకి ప్రోషిత గఁ
గేరుటఁ దోఁచును సీత లక్ష్మణా! ౬

లక్ష్మ:-ఆర్యా! నదీతీర మతివిషమముగా నున్నది. అప్రమత్తుఁ

డవై దిగుము. (ఉభయులు దిగి చూచి) ఈసైకతము లవిరళపదన్యాసలాంఛితములై యున్నవి. వృంతమాత్రావశేషములై సంసూచ్యమానకుసుమాపచయములై యీతీరలత లున్నవి. లూనకిసలయములై విరళచ్ఛాయలతో నీవనస్పతులనీడ లున్నవి. అందుచేఁ బ్రత్యాసన్నవర్తి లగుమనుష్యాధివాసము లున్నట్లు తోఁచెడిని. ఔను:

చ. దివిజులపూజకైనవి న
దీజలపుష్పవితానముల్; తట
స్థవిరళసైకతంబు బలి
దానసమృద్ధము గాఁగఁ దోఁచు; నీ
వివిధతరంగమధ్యమున
వింతగఁ దేలెడుఁ గుందమాల తా
నవు ననిపించుచుండెఁ భుజ
గాద్భుతకన్య మృదుత్వసంపదన్. 2

రాము:-కేవలము ప్రత్యాసన్నముననే కాదు. ప్రతిస్రోతోపగతప్రదేశమునను మనుష్యాధివాసములు గల వని తోఁచెడిని.

లక్ష్మ:-ఆశ్చర్య మాశ్చర్యము! దేవపాదాంతికపరిచర్యాపేక్షచే వలె సముద్రగామిని యగు తరంగపరంపర క్రమముగా నీకుందమాలను మీపాదాగ్రముల సమర్పించినది. దీని రచనానైపుణి యార్యు లవశ్యముఁ జిత్తగింపవలయును. (పుచ్చుకొని చేతి కిచ్చును.)

రాము:-(మాచి రోమాంచమున) వత్సా! ఈకుసుమరచనావిన్యాస కౌశలము దృష్టపూర్వము వలె నున్నది.

లక్ష్మ:-ఎచట దృష్టము?

రాము:-వేఱొకయోషిత్తు నీదృశానుష్ఠాన మెట్లు కలుగును?

లక్ష్మ:-దేవీసమీపముననా?

రాము:-కాక మఱి యెక్కడ?

లక్ష్మ:-దుర్విదగ్ధుఁడగుప్రజాపతి యెట్లు క్రీడించునో యెవని కెఱుక! ఆర్యా! ఈకుందమాల బయలువెడలినతావు చేరువఱకు నీస్రోతోనుసారులమై గోమతీతీరమువెంట నరుగుదము.

రాము:-సాధారణముగా లోకసన్నివేశములు సాదృశ్యసులభములు. మన మంతటియదృష్టవంతులమును గాము. దూరదేశపరిత్యక్త యగుసీత యీతావునకు వచ్చుటయు నసంభావ్యమే. ఐనను, మన మీమార్గమును విడువక తదాదేశస్థానపర్యంత మేఁగుదము.

లక్ష్మ:- ఈనదీభూమి కంటకితశర్కరాశుక్తిపుటదుఃఖసంచారము. కావున, నేను జూపినమార్గముననే యరుగుదెండు.

రాము:-అట్లే చేయుదును. ఈకుందమాల నాకత్యంతప్రియకరమైనను దేవతోపహారశంకచే నుపయోగింపక విడిచి వేయుదును. (విడిచివేయును.)

లక్ష్మ:-

చ. ఇది యొకవేత్రవల్లి; గమి
యింపుము దీనిఁ; బదంబు వెట్ట కి

య్యాదనున శుక్తు లిందు; విన
తాత్మత వంపుము మూర్ధముల్ బడిం
బడిగ; సతంబు వృక్ష మిది
వారణచేయుము కార్ముకంబునన్;
బెదరు శరారుభీరువులు
పెద్దయుఁ గాన గమింపు నెమ్మదిన్. ౮

రాము:-(అట్లు పరిక్రమించి) వత్సా! ఈసమీపమున వాల్మీక్యాశ్రమ మున్నదా?

లక్ష్మ:-ఆర్యున కేమి కానవచ్చినది?

రాము:-

గీ. సావధానతఁ జూడ నాచక్కఁ దోఁచు
హోమధూమపురేఖ లాక్రామకములు;
మందమలయానిలంబున మలయుచుండి
సామగానము వినవచ్చు శ్రావ్యముగను. ౯

లక్ష్మ:-ఆర్యా! చక్కఁగా నుపలక్షించితివి. నేను ముందున కేఁగి కనుఁగొందును. (పరిక్రమించి భ్రమానుపాటుతో) ఏమి? ఇక్కడఁ గాలిడఁగనే నాహృదయము సాధ్వసభరిత మగుచున్నది. ఊరులు స్తంభించినవి. అడుగులు పడకున్నవి. ఏమికారణమో కదా! (ఆలోచించి) గురుజన సమాక్రాంత మీప్రదేశము కానోపును.

రాము:-వత్సా! ఏ మింతశ్రద్ధతో భూమిఁ బరీక్షించుచున్నావు?

లక్ష్మ:-అన్నా! నితాంతమనోహరములై సంక్రాంతచరణతల సౌకుమార్యములై లలితనిభృతవిన్యాసముతో నీప్పునిస

తలగోచరము లైనపదములు విలాసవతి వని తోఁచు
చున్నది. విలోకింపుము :

చ. పరమవిలాసయోగమొ ప్ర
బాధపరిశ్రమసిద్ధియో లస
ద్గరిమమొ నైజసంపదయొ
కారణ మే దయి యున్న నిట్టు లే
తరుణియొ సంచరింప సిక
తాతలమందుఁ బదాంకముల్ పర
స్పరకలహంసవిభ్రమపు
భాగ్యముఁ జూపు మనోహరంబులై. ౧౦

రాము:-(పరికించి హర్షముతో) వత్సా! ఏతరుణివో యన నేల?
సీతాదేవిపదచిహ్నము లనియే పలుకుము. చూడుము :

చ. పదసమవస్థితిన్ గనినఁ
బ్రస్ఫుట వక్రారచనంబుఁ గన్గొనన్
విదితము లయ్యెవే; మఱి య
వే కమలాంచితపాదరేఖ; ల
య్యదె తిలకంబు చారువు; స
సంతవిచార వికీర్ణ మైననా
యెద హరియించెఁ జూడఁగనె;
యియ్యది దేవిపదాళియే యగున్. ౧౧

లక్ష్మ:-(హర్షముతో) ఈవిధ మగునీపదపంక్తినే యనుసరించి
వాల్మీక్యాశ్రమమునకుం బోవుదము. ఈపదపంక్తులు
కడునూతనము లగుట నీసమీపముననే దేవి యున్నట్లు
తోఁచుచున్నది.

(అంత సీత ప్రవేశించును.)

సీత:-సవనసిర్వర్తన మైనది. సంధ్యోపాసనము నెఱవేఱినది. హోమక్రియ ముగిసినది. భాగీరథ్యవగాహాంతమున భగవతి నుద్దేశించి స్వహస్తగ్రథిత మగుకుందమాలను నివేదించితిని. ఇఁక, నీయున్నతగంభీరశీతలలతాజాలముఁ బ్రవేశించి యతిథిజనోపస్థానయోగ్యము లగుకుసుమములు గోయుదును. (అట్లు చేయును.)

లక్ష్మ:-ఈపదపంక్తి క్రమముగాఁ బులినతలమును బరిత్యజించి భూతలమును జొచ్చి మాయమైనది. అందుచే నెదుటఁ గాననగుసుందరలతాగుల్మరమణీయమధ్యమప్రదేశమును జొచ్చి మార్గశ్రమ మపనయించుకొన్నపిదపఁ బ్రాచేతస మహర్షిని దర్శింతము.

రాము:-నీయభిరుచి. (ఇరువురుఁ బరిక్రమించి కూర్చుండుదురు.)

రాము:-(నిశ్వసించి కన్నీటితో) వత్సా! వత్సా!...

సీత:-(చెవి యొగ్గి) ఎవరువారు? సజలజలద స్తనితగంభీరస్వరవిశేషముచే నత్యంతదుఃఖభాజన మగునాశరీరమును బులకింపఁజేయుచున్నారు! నిరూపించెదను. ఐనను, సత్యము గ్రహింపకుండ నస్థానమున దృష్టి ప్రసరించుట నా కుచితము గాదు. ఇంతకు నిటఁ దెలియవలయునదేమి? పరపురుషశబ్దము నాదేహమున రోమాంచముఁ గలిగింపఁజాలదుగదా! ఆనిరను క్రోశుఁడేయిట సంప్రాప్తుమైయుండుట సువ్యక్తము. పరికించెదను-కాదు. ఆవిధమునఁబరాఙ్ముఖుఁ డగునాతనియందు నిట్లభిముఖ నగుదుననుకొనుట నాకేసిగ్గొదవించుచున్నది. కావునఁజూడను.(పరాఙ్ముఖియై

ఏమి! నన్ను నేనే జయింప లేకుంటిని! బలాత్కారముగా నాదృష్టి యక్కే మరలుచున్నది. ఏమి చేయుదును? రాజ పరాధీన యగుదాని నక్కే నియోగించెదను. (చూచి) ఆహా! కన్నుల పండు వాయె నని గాఢసంతోషము; చిర ప్రవాస మని పరమదుఃఖము; పరిత్యజించుటచే మహో ద్వేగము; నిరనుక్రోశుఁ డని ప్రబలాభిమానము; చిరపరి చితుఁ డని యనంతానురాగము; దర్శనీయుఁ డని యుత్కంఠాతిశయము; స్వామియని బహుమానపరంపర; కుశలవపితృదైవ మని కుటుంబినీసద్భావము; అపరాధ ప్రవేశిత నని యమిలతజ్ఞ: వీనిలో నార్యపుత్త్రదర్శనమున నేనేమి యనుభవింతునో తెలిసికొనఁ జాలకున్నాను.

లక్ష్మ:-ఆర్యా! ఏలకో నన్నాకస్మికముగఁ బిలిచి బాష్పాయ మానవనయనుఁడవై యధోముఖ సంవృత్తి నూఱకుంటి వేమి?

రాము:-వత్సా! నిస్సంపాతవివిక్తమగునీయరణ్యమును,దటరుహ తరుచ్ఛాయానమాకీర్ణ రమణీయసైకతయై సముద్ర గామిని యగునీప్రసన్నసలిలవాహిని,నాలోకింప దండకా వనవాససంస్మృతి గలిగి దుఃఖమునకుఁ గారణమైనది.

సీత:-ఆర్యపుత్త్రా! వనవాసము స్మృతికి వచ్చినదా? వన వాసినిమాత్రము రాలేదుకదా?

లక్ష్మ:-ఆదుఃఖైకవాస మగువనవాసమున స్మరింపఁదగిన దే మున్నది?

రాము:-వత్సా! లక్ష్మణా! ఏమున్నదందువేమి?—— దుఃఖైక వాస మగువనవాసమునఁ గలది-చూడుము, చూడుము:

చ. కిసలయసౌకుమార్యమును
గేహకరం బవలంబనంబుగా
రసికత దేవి యీయఁ గొని
రమ్యము లైనరతిప్రసంగముల్
వినువక చెప్పుకొంచు నతి
విస్ఫుటపాదబలంబుచే జలం
బిసుకను బొంగ సంధ్యలను
నే మొనరించుపచారు లెన్నెదన్. ౧౨

సీత:-ఓయీ! నిరనుక్రోశా! ఈసల్లాపసంగతిచే నేల యశరణను దుఃఖితను నగు నన్ను మఱింత బాధించెదవు?

లక్ష్మ:-ఆర్యా! శోకము వలదు.

రాము:-మందభాగ్యుఁడు శోకింప కేల యుండును? చూడుము:

క. తొలి వనవాసము, లంకన్
మలి వనవాసంబు, నేఁడు మరలఁ బ్రవాసం,
బిల నన్నధన్యుఁ గూడుటఁ
జెలి దుఃఖముమీఁద దుఃఖసిద్ధిఁ గనెఁ గటా! ౧౩

సీత:-ఆర్యపుత్త్రా! నిర్వాసిత నగునన్నుఁగూర్చి దుఃఖింపకుము.

రాము:-హా! జనకరాజపుత్త్రీ!

సీత:-అల్పపుణ్యభాగిని. వర్ధనీయ.

రాము:-హా! వనవాస సహాయినీ!

సీత:-ఇప్పుడు నా కాయోగము లేకపోయినదిగదా!

రాము:-హా! ఎటకుఁ బోతివే!

సీత:-మందభాగిని యెటకుఁ బోఁగలదు!

రాము:-నాకుఁ బ్రతివచన మీయవా?

సీత:-అసంభావనీయ మగునే నెట్లు ప్రతివచన మిత్తును ?

రాము:-(శోకించును)

లక్ష్మ:-ఆర్యా! శోకింపకుము. శోకింపకుము.

రాము:-వైదేహి శోచనీయమై యుండ నే నెట్లు శోకింప కుందును ?

సీత:-ఆర్యపుత్రా! వైదేహి శోచనీయ యనకుము. ఎవ్వతెను గుఱించి వల్లభుఁ డిట్లు శోకించుచుండెనో యామె శోచనీయ కాదు.

రాము:-వత్సా! లక్ష్మణా! సీత యెచ్చట నున్నదో తెలిసి కొనఁగలవా ?

సీత:-దివసావసానవినివారితసమాగమమున నుండు చక్రవాకివలె నిచ్చటనే ప్రవాసినినై యున్నది.

లక్ష్మ:-ఎచటఁ గలదో తెలిసికొన సాధ్యము గాదు.

రాము:-చిరకాలావిచ్ఛిన్న మగురఘువంశ మిట్లు విచ్ఛిన్న మైనది గదా! (రోదనముచేయును)

సీత:-(శోకముతో) అతిమాత్రముగా నార్యపుత్త్రుఁడు సంతాపించుచున్నాఁడు. ఏమి చేయుదును? సాహసించి యశ్రుసంచయ మైనదృష్టికి స్తిమితదర్శనముకలుగఁజేయుదును. (అడుగిడి) కాదు.జనప్రవాదము లక్ష్యపెట్టవలయుఁగదా! శోకావేగబలాత్కారిత నయ్యు నార్యపుత్త్రుఁడు ననుఁ గనకమునుపే నే నటు చేయఁజాలను. ఈసమయమున నిటకు మునిజనము రాఁగలదు. ఆకస్మికముగా నన్నెవరైనఁ జూడఁగలరు. అందుచే, లతాజాల ప్రచ్ఛన్నసుఖ సంచారమార్గమున నాశ్రమముఁ జేరెదను. అటఁ గుశల

వుల సంభావించెదను. (చూచుచు నిష్క్రమించును.)

(అంత నొక ఋషి ప్రవేశించును)

ఋషి:—వాల్మీకిభగవానుఁడు నాకి ట్లాదేశించియున్నాఁడు: "వత్సా! బాదరాయణా! లక్ష్మణసహాయుఁడై రామభద్రుఁ డీతపోవనముఁ బ్రవేశించె నని విని యున్నాను. చాలకాలమునుండి నాదర్శనార్థము వేచియుండి మాధ్యాహ్నికకార్య సంపాదనావ్యగ్రుఁడనై యుందు ననికాఁబోలు బయటఁ గూర్చుండియుండును. నీ వతని కడ కేఁగి,మాధ్యాహ్నికకార్యనిర్వాహణ మైనదనియుఁ దన్ను దర్శింపఁ గోరుచుంటి ననియుఁ దెలుపుము." అందుచే వాల్మీకియాదేశము ననుసరించి రాముని వెదకుదును. (నడచును.)

లక్ష్మ:-(విలోకించి సంభ్రమముతో) ఆర్యా! తపోధనుఁ డొకఁ డిటు కే తెంచుచున్నాఁడు.

రాము:-(కన్నీళ్లు తుడుచుకొని ధైర్యముతో నుండును.)

ఋషి:-(నిరూపించి) ఇదిగో! ఈలతాగుల్మప్రచ్ఛాయమున నిరువురుపురుషులు కానవచ్చుచున్నారు. లక్ష్మణసహాయుఁ డగు రాముఁడే యాతఁడు కానోపును. (ఆలోచించి) సందేహ మేమి?

చ. మందము మందమై మలయ
మారుతపోతము వీచు హాయి, నా
నంద మొసంగు నర్కకిర
ణంబులు తీవ్రత వీడి; యేణముల్

డెందములందు సంశయమి
లీసత నేఁగు మృగేంద్రుఁ గూడి; మ
ధ్యందిన మైన నీడ గల
దాతనిపై హరి సూతుఁడే యగున్. ౧౪

కేవల మతిక్రాంతమానుషప్రభావముననే కాదు. ఆకారము కూడ నానిశ్చయమును బలపఱచుచున్నది. (నిరూపించి)

శా. వ్యాయామంబునఁ గర్కశం బయిన దే
హం బెల్ల శ్యామాత్మకం;
బాయాకర్ణ విశాలనేత్రము లహో
ర్యం బైన తోజోంశముల్;
శ్రేయం బైన విశాలవక్షముఁ గృపా
శ్రీతోడి ప్రాంశుత్వమున్;
ఆయాజానుకరాంబుజంబులును రా
మాకారదృష్టాంతముల్. ౧౫

నే సీతని సమీపించి విషయము నివేదింతును. (సమీపించి) రాజా! స్వస్తి.

రాము:-మునీంద్రా ? అభివాదములు.

ఋషి:-విజయ మగుఁగాక!

రాము:-ఆర్యా! భవదాగమన ప్రయోజనముఁ దెలియఁ గోరుదును.

ఋషి:-వాల్మీకిమహర్షి సకలకర్మపరిసమాప్తి నంది మహారాజాగమనము నపేక్షించుచున్నాఁడు.

రాము:-(విలోకించి) ఓహో! మధ్యాహ్న మతిక్రమించినది. అందుచే :

గీ. మహితమధ్యాహ్న భానునుమ్మలిక కోడి
తరులమూలంబుఁ జేరె యధ్వగులు పిదపఁ
జల్లపడఁ దమయాత్రకు సాఁగునట్లు
ఛాయ లెల్లను మెల్లన సాఁగిపోయె. ౧౬

మఱియు:

శా. మధ్యాహ్నార్కమయూఖతాపశిఖచే
మ్రందన్ శరీరంబు, త
న్మధ్యాస్ఫూర్తికి వేగ వచ్చి నదిలో
మేన్ముంచి యోలాడి, త
న్మధ్యప్రాప్తజలార్ద్రకర్ణపవనా
నందంబునన్ దీరసా
న్నిధ్యంబుం గను, సంచలింప ధునియున్
వేదండరాజంబు తాన్. ౧౭

(అందఱు నిష్క్రమింతురు.)

తృతీయాంకము సమాప్తము.

ఓం

శ్రీ గురుభ్యో నమః

# కుందమాల

(ప్రవేశకము iii)

(అంత నిద్దఱుతపస్వినులు ప్రవేశింతురు.)

ప్రథమ:-ఏమే! యజ్ఞవేదీ! రామాయణసంగీతశ్రవణానందము నకై వాల్మీకితపోవనమునకు వచ్చినతిలోత్తమ నాతో నిట్లు చెప్పినది: "నాప్రభావమువలన సీతారూపము ధరించి రామునకుఁ గనఁబడి యాతఁడు సీతయెడ సానుకంపాత్ముఁడై యున్నాఁడో లేఁడో చూచెదను. కావున, రాముఁ డెచట నున్నాఁడో యరసి రమ్ము." నీవు నాకు రాముని జూపఁగలవా?

యజ్ఞ:-ఓసీ! వేదవతీ! తిలోత్తమ నీకీమాటలు చెప్పినప్పుడు సమీపమునఁ గలగుల్మలతచాటున దాఁగి యుండి రామవయస్యుఁ డగునార్యహాసితుఁ డామాట లన్నియు వినియున్నాఁడు.

వేద:-అయ్యో! గొప్పచిక్కే వచ్చినదే. రహస్యవృత్తాంత మంతయు నెఱిఁగినరామునియెదుట సీతాచరితము నను వర్తించుట తిలోత్తమ విపరీతోపహాసిత యగుటకే కారణ మగును. కనుక, నాప్రియసఖిఁ దిలోత్తమ నీపని విరమింపు మందును.

యజ్ఞ:-సఖి! సీతాదేవి యెచ్చట నున్నది?

వేద:-వినుము. ఈసప్తమదివససమాగత త్రైసతపస్వినీమణులు వాల్మీకిభగవానునితో నిట్లు విన్నవించుకొనిరి: "ఈయాశ్రమపదదీర్ఘిక మేము పద్మములు కోయుట మున్నగు నాత్మోపభోగములు జరపుకొనునపుడు పరపురుషనయన గోచర మగును. మహారాజును సన్నిహితుఁడై యున్నాఁడు. అందుచే స్త్రీలు స్నానము చేయుట కిది యనుకూలముగా లేదు." ఇది విని వాల్మీకిభగవానుఁడు నిధ్యాననిశ్చల నయనుఁడై నిమేషమాత్రము ధ్యానించి యిట్లు పలికెను: "ఈదీర్ఘికయందు వర్తించుస్త్రీలు పురుషనయనగోచరలు కాకుందురుగాక!" అప్పటినుండియు సీతాదేవి రాముని దృష్టిపథమునఁ బడకయే దీర్ఘికాతీరమున దినమంతయు నుండుచున్నది.

యజ్ఞ:-రామునకును దమకును గలసంబంధము కుశలవులకుఁ దెలియునా?

వేద:-బాలభావముచేతను మునిజనసంసర్గముచేతను దమతల్లి పేరైనను వారెఱుంగరు. ఇఁక, వారికి దీర్ఘప్రవాస విచ్ఛిన్న మగురామవృత్తాంత మెట్లు తెలియును?

యజ్ఞ:-రాముఁ డీతపోవనమునకు వచ్చియున్నసంగతి నీ వెఱుఁగుదువా?

వేద:-ఎఱుఁగ కేమి?

యజ్ఞ:-సరే! నీవు తిలోత్తమకడ కరుగుము. నేను సీతాసమీపమున కేఁగుదును.

(నిష్క్రమించును)

ఇది ప్రవేశకము.

ఓం

శ్రీగురుభ్యో నమః

# కుందమాల

## చతుర్థాంకము.

(అంత నుత్తరీయముఁ గప్పుకొని సీతయు, యజ్ఞవేదియుఁ బ్రవేశింతురు.)

యజ్ఞ:-చెలీ! వైదేహీ! ఈయపూర్వ మగునుత్తరీయయుగళము ధరింప నీ కెవ్వ రుపదేశించియున్నారు?

సీత:-అత్యంతశీతలమైన తరంగవాహినినుండి యేతెంచుదీర్ఘదీర్ఘకామారుతము.

యజ్ఞ:-సఖీ! ప్రవాసవిరుద్ధముగా నీశారదచంద్రకిరణరాశిపరిపాండురము, సురభిబహుళామోదసమారబ్ధమధుకరకులసంగీతమనోహరము నగునీప్రావరణము ధరించుట తగునా?

సీత:-చెలీ! ఆనాఁ డట్లు దశరథమహారాజశాసనమున వనవాసప్రాప్తి యైనపుడు చిత్రకూటము విడిచి దక్షిణాపథమునకుఁ బోవుతఱిఁ జిరవాససముత్పన్నసఖీస్నేహమునఁ జింతాకులయై వనదేవత మాయావతి తనస్మరణనిమిత్తము చంద్రధవళము వాసితసుగంధాత్మకము నగునీదివ్యోత్తరీయమును నా కొసఁగినది. ఆర్యపుత్త్రుఁ డపు డటనే యుండెను. మఱియు, నపుడు మాయుభయులహస్తములందు సఖీభూతమును బరదుఃఖసహాయము నై యున్న దగుట నిపుడును దీనిని సాదరముగా ధరించితిని.(దుఃఖించును)

యజ్ఞ:-సఖీ! విలపింపకుము. తపోవనవాసము వనవాసమే కాదని పెద్ద లందురు.

సీత:-చెలీ! విలపింప కెట్లుండఁగలను? ఆర్యపుత్త్రుఁడీతపోవనమునకు వచ్చియుండుటచే ద్విగుణీకృత...ఏకాకినై రాత్రిందివములు దీర్ఘనిశ్వాసములతోఁ గడపుచున్నాను. ఇదే బలవంత మగునాయావేగహేతువు.

యజ్ఞ:-సఖీ! ఈయనుభవము లలక్షణీయములు. నీ వీదీర్ఘికా తీరమున విహంగమమిథునవిభ్రమ మవలోకించుచు మనమున నానందింపుము. నేను నాపనిమీఁదఁ బోయి వచ్చెదను. (నడచును.)

సీత:-(దీర్ఘికను జూచి) సఖీ! ఈరాజహంసమిథున మెంతధన్యమైనది! విరహ మన్నదే యెఱుఁగక సమాగమసుఖ మిట్లనుభవించుచున్నదికదా! దంపతులకు నావంటివిరహోపదేశనిపుణోపాధ్యాయి లేదనుట నిశ్చయము. ఇచటిపక్షులుసైతము పరస్పరహృదయగ్రహణసమర్థము లగు చాటుప్రయోగములు ప్రస్థాపించుచున్నవి.

యజ్ఞ:-(నిరూపించి) ఓహో! ఈమునిజను లెల్లరును ససంభ్రమ తత్క్షణవిముక్తాసనులై యంసదేశములందలివల్కలములు సవరించుకొనుచు విస్మయోత్ఫుల్లలోచనులై యేకముఖమున నపసృతులైరి. మహారాజు విచ్చేసియుండు నని తోఁచుచున్నది. (నిష్క్రమించును.)

(అంతఁ గణ్వుఁడును జింతాగ్రస్తుఁ డగురాముఁడును బ్రవేశింతురు.)

కణ్వ:-నైమిశారణ్యారామణీయకదర్శనమున దాశరథిని వినోదింపఁజేయు మని వాల్మీకిభగవానుఁడు నాకాదేశించి

యున్నాఁడు. ఈతఁడు మరలఁ జింతాధీనమనస్కుఁడై
యెదుట నున్న నన్నును గనఁజాలకున్నాఁడు. అందుచే:

గీ. సమపథంబున నై సంస్ఖలన మందు
జాగుసేయుచు నడుగిడు, సరకుగొనఁడు
పరమరమణీయ మైనయివ్వనపుఁబ్రకృతిఁ
గంటఁ జూడఁగనైన మొగంబు వాంచి. ౧

(సమీపించి) ఓ రాజా!

రాము:-అయ్యో! మిత్త్రిమా! తాపసవిరుద్ధముగా నామం
త్రించితి వేమోయీ! అది వయఃపరిణామదోషము
కాని నీదోషము కాదులే!

గీ. బాల్యమున రాముఁడను నీకుఁ బలుకరింపఁ,
గణ్వుఁడవు నీవు నాకు నాకాలమునను;
మిమ్ము నార్యులఁ జేసెఁ గాలమ్ము నేఁడు
మమ్ము రాజులఁ జేసెఁ; దన్మహిమఁ గంటె! ౨

కణ్వు:-ఓహో! ఈయుపాలంభము ధీరోదాత్తముగదా!

రాము:-నీవు చెప్పఁదలఁచినది చెప్పుము.

కణ్వు:-

గీ. సురభిసుమగంధవిసరముల్ నెరపి దిశల
ఫలభరవినమ్రబహుపాదపప్రసిద్ధ
నీలపరివేషరేఖతో నెగడునీవ
నాంత మొనరింపదే నీకు సంతసంబు? 3

రాము:-బహుమాననిరంతరీకృతమానసుఁడ నగున నీవన
మెంతయు సంతోషపఱచుచున్నది. కాదనుట కావం
తయు నవకాశము లేదు. చూడుము:

శా. దావాగ్నిన్ గ్రతుహోమపావకనిగాం
దర్కించెతు, యూపాళిగా
నీవృక్షాళిఁ దలంతు, సామరవ మం
చెంతుఁ శకుంతధ్వనుల్,
భావింతుఁ హరిణంబులన్ మునివరు
ల్గా, నైమిశారణ్యసం
భావప్రీతి యెసంగ నిల్పుదు భువిన్
బాదంబు లెట్లో సఖా! ౪

కణ్వు:-నీకు నైమిశమం దిట్టిగౌరవ మెంతయు యుక్తమేకదా! ఏలన, నీవు సకలజగదభ్యుదయనిశ్రేయసహేతుభూతుఁడవు; ధర్మపరాయణుఁడవు నగుమహారాజవు. ఇఁక, నైమిశమో పూర్వరాజర్షి వంశాధ్యాసితము, నిష్ప్రత్యూహతపస్సిద్ధిక్షేత్రమును గదా!

శా. ఆనాకంబుగ నొక్కవింట భువనం
బత్యంతముఁ గెల్చి తా
రా నాకంబున కేఁగఁగాఁ గ్రతుశతం
బభ్యర్థులై చేసియుఁ
సూనుప్రస్ఫుటరాజ్యచక్రవిలస
త్స్ఫూర్తిన్ దపోగాములై
జ్ఞానైకాత్ములు నీదుపెద్ద లిట వా
సం బుండుటల్ వింటికా! ౫

రాము:-(నమస్కరించును.)

కణ్వు:-ఈయనన్యతపోవనసాధారణ మగునైమిశారణ్యమాహాత్మ్య మవలోకింపుము :

మ. దళనవా సన్నివసన్మహేశ్వరశిర
స్త్రారాధిపజ్యోత్స్నఁ జ స
మ్మిళితం బౌచుఁ గవోష్ణతం బౌరయునా
మిత్త్రాంశుతీవ్రప్రభన్
జలిమల్ గంపవు ప్రాఁకులన్; సరసులన్
దా రింకవున్ నీళులున్;
గలుగంబోదు శ్రమంబు ప్రాణులకు; నా
నందంబుఁ గన్పండు వో. ౬

అంతేకాక:

ఉ. ఈవితతాధ్వరంబునసె
యింద్రుఁడు నిత్యము నిల్చియుండి యై
రావతముఁ సమీపతరు
రాజినె, నందనచందనద్రుమహా
భావతఁ గట్టివేయ; ఘన
పాదపముల్ కట! కట్టుఁగంబముల్
గా, వివిధంబు లై నబలు
గాయములం గనె రజ్జుపీడచేఁ. ౭

రాము:-(చూచి) నిత్యము యజ్ఞములే జరుగుచుండు నీధర్మార
ణ్యముకతమున నింద్రుఁడు నందనవనమే మఱచిపోయి
నాఁడు :

క. సురపతిగుఱించి విప్రులు
నిరతముఁ బఠియించుమంత్రనివహము విని తా
సురపతిభామిని దాల్చును
విరహపుఘనవేణి విరులు విడిచి కృశాత్మన్. ౮

కణ్వు:-మఱియు నిది చూడుము:

గీ. కరికపోలమదంబును గాంక్షచేసి
మూఁగు తేఁటులగమి విఘ్నములను గనదు
సామగానంబు మదికి నిశ్చలతఁ గూర్పఁ
గర్ణతాళము లాడింపఁ గరులు మఱవ.

రాము:-(నవ్వి) ఇం దాశ్చర్య మేమి?

చ. మునివరసామగానరవ
మోదసుధామధురప్రవృద్ధి యె
వ్వనికిని బల్కశక్యమె! ప్ర
వాసిజనంబుల కైన విన్నఁ ద
ద్ధ్వనిమహనీయసౌఖ్యరస
ధామముగా విలసిల్లుచుండ నే
మని తలపోయవచ్చు నహ
హా! మదనాగము లందుసౌఖ్యముల్. ౧౦

కణ్వు:-(తనలో)ఆహా! రామునిప్రవాసనిర్వేదము! ఈతని తలఁపున విరహులు తిర్యగ్జంతువులకన్నను శూన్యహృదయు లనికదా! (ప్రకాశముగా) సావధానముగా నిటు చూడుము:

చ. అమలవసంతమాససమ
యంబు గతించిన; హానిశక్తిచే
సుమభరతన్ సుగంధమధు
సుందర హాసహాకారశాఖికా
సముదయమున్ ద్యజించి యళి
సంతతులున్ గ్రతుహోమధూమముఁ

తము లయి పాఱి తూఱి మఱి
దాఁగును ఫుల్లసరోజపంక్తిలోన్. ౧౧

రాము:-అనవరతాహుతిసంవర్ధిత మగునీధూమరాశి మధుకర నికరమునువలెనే మనలను బాధించుచునే యున్న దేమి? (ధూమబాధ నందును).

కణ్వు:—అయ్యో! అయ్యో! ధూమపర్యాకుల నయనునివలె నున్నావే!

రాము:—

గీ. జనకజవియోగదుఃఖబాష్పములు సతము
కాలువలుగట్ట బాధించుకన్నుఁగవకు
నిపుడు క్రతుహోమధూమ మెంతెంతయైన
బాధకం బయ్యెనయ్య తపోధనుండ!

కణ్వు:-ఐన, మనయెదుటఁ గలసరోవరదీర్ఘికయం దవగాహన మొనరించి శీతలసలిలముచేఁ గనులు గడుగుకొని నేత్రబాధానివారణకై ముహూర్తమాత్రము విశ్రమింపుము. నేనును గులపతియగ్నిహోత్రావసరమున దగ్గఱనుండి సంభావింతును. (నిష్క్రమించును.)

రాము:-(పరిక్రమించి) ఈడిగ్గియలోనికి దిగియెదను. (దిగి) ఆహా! ఈకమలాకరప్రసన్న సలలిత యద్భుతముగదా! (నీటిలో నొకనీడను గాంచి సంభ్రమముతో) ఏమి! సీతకూడ నిచ్చట నున్నదే! (హర్షవిస్మయము లందును.)

సీత:-(విలోకించి) అయ్యో! హంసమిథునమును జూచుచునున్న సందర్భమునఁ దలవని దలంపుగ నార్యపుత్త్రుఁడు వచ్చినాఁడు. నేను జూడనే లేను. అపసరిల్లుదును. (అట్లు చేయును.)

రాము:-ఏమి! నన్ను సంభావింపకయే సీత ప్రస్థితిఁగనుచున్నది!

క. లంబాలకపాండురవద
నంబునఁ జిరవిరహబాధ నన్ గాంచి సహా
స్రంబు లగుకోర్కె లుఁడ మ
నంబున; నిన్నాక్షెఁ గాంచినన్ బోవు నెటో! ౧౩

ఆమెను బట్టుకొందును. (చేతులు సాఁచి) ఇది వైదేహి కాదే!

క. ఈదీర్ఘికానుసారిణి
వైదేహి గమింప నెటకొ వానిని వోఁచెన్
ఆదేవిఛాయ, దాసిని
వైదేహిగఁ దలఁచి పట్టనచ్చితి వాంఛన్. ౧౪

ఈసీడయొక్కమూలప్రకృతిఁ గనుఁగొందును. (వెదకును) ఈదీర్ఘికాతీరము నిస్సంపాతవివిక్తమైనది. బింబము లేనిదే ప్రతిబింబము సంభవింపదుగదా! ఇది యేమి మఱి!

సీత:-నాప్రతిబింబముఁ జూచినయార్యపుత్త్రుఁడు నన్నేల చూడకున్నాఁడు? (ఆలోచించి) ఔను. తెలిసినది. ఈదీర్ఘికాతీరమున సంచరించు తపోవనవాసిను లగుస్త్రీలు పురుషనయనగోచరలు గాకుండుట ముని ప్రసాదసిద్ధము. అట్టి స్త్రీజనులనీడయైన నీజలములఁగానరాఁగూడదని మహర్షి యాదేశించియే యున్నచో నార్యపుత్త్రిన కది యనుగ్రహమేయై యుండెడిది. నేనును బ్రతికృతి కాసరాకుండఁ దొలఁగిపోవుదును.

రాము:——పోనిమ్ము. ప్రసన్నసలిలమధ్యవర్తిని యగుప్రతిమా సీతనైనను గాంచి యానందింతును. (చూచి) అయ్యో! అది కూడ నంతర్హితమైనదే! (మూర్ఛనందును.)

సీత:-అయ్యో! అయ్యో! ఆర్యపుత్త్రుఁడు మూర్ఛిల్లెనే! సమీపించెదను. (నడచి) ఆర్యపుత్త్రుఁడు సంలక్షితుఁడయి మరలఁ గోపించెనేని యీమునిజనులు నన్నవినీతురాలని సంభావింతురు. కావునఁ, దొలఁగిపోదును. (మరలి) కాదు. ఇది యుక్తాయుక్తవిచారణమునకు సమయముగాదు. ఆర్యపుత్త్రుఁడు మరల నన్నుఁ గోపించినఁ గోపించుఁగాక! మునిజనములు నన్నవినీతురాలని సంభావించిన సంభావింతురుగాక! ఈస్థితిలో నున్న యార్యపుత్త్రునిమాత్రము నే నేమైన నుపేక్షింపఁజాలను. (పరిక్రమించి) ఓలోకపాలురారా! వినుఁడు. నే నార్యపుత్త్రి నిర్వాసితనైనను నవినీతిచే నాతనిశాసన మతిక్రమించుటలేదు. శోకావేగబలాత్కారిత నయియే నిలువలేక యిట్టిసాహసము చేయుచున్నాను. (సమీపించి చూచి) అయ్యో! అయ్యో! ఆర్యపుత్త్రుఁడు మూర్ఛిల్లెనే! (కౌఁగిలించును.)

రాము:-(మూర్ఛదేఱును.)

సీత:-(అపసరిల్లును.)

రాము:-ఏమి! ఆకస్మికముగా రోమాంచితుఁడనైతిని!

సీత:-అట్లు నిర్వాసితనై యిట్లు సాహస మవలంబించినందులకు భీతాత్మ నగుచుంటిని.

రాము:-(విలపించుచు)

గీ. గాఢపరిరంభణం బిచ్చి కావుము సతి!

సీత:-నే నపరాధను.

రాము:- దర్శనం బిచ్చి యేలుకో తరుణి! నన్ను

సీత:-సిద్ధశాసనము వారించుచున్నది. మందభాగ్య నేమి చేయుదును ?

రాము:- ప్రబలకోపంబు విడువు నాపయిని దేవి!

సీత:-ఆర్యపుత్త్రుని నే నదే కోరుచున్నాను.

రాము:- ఏల నిర్దయ నామీఁద నింతి! నీకు. ౧౫

సీత:-ఆర్యపుత్త్రా! ఇది విపరీతోపాలంభనముగదా !

రాము:- గీ. కాంత ! విజ్ఞాపనం బొనరింతు నొకటి

సీత:-ఆర్యపుత్త్రా ! అవహితమతిని. ఆజ్ఞాపింపుఁడు.

రాము:- నీవు సచ్చరితంబున నెగడినావు

సీత:-ఆహా! నాప్రాణములు త్యజింపఁదగినవి కావుకదా!

రాము:- సాగనంపితి నిన్ను దేశంబునుండి

సీత:-సకలపరిజనులపట్ల నార్యపుత్త్రుఁడు నిగ్రహానుగ్రహసమర్థుఁడుగదా !

రాము:- నన్ను మన్నించి దేవీ! ప్రసన్న వగుము. ౧౬

సీత:-నే నెప్పుడును బ్రసన్ననే. నీప్రసన్నతయే నాకుఁ గావలయునది.

రాము:- చ. మరలఁ బటాంతశయ్యవయి
మత్కరమే యుపధానమై సుసౌ
ఖ్యరసముఁ బెంపఁ బూర్ణశశి
గర్భిత మైనవిభావరీ సఖీ!
కర మనురాగవారినిధిఁ
గ్రమముగా నవగాహనంబులన్
నెరపి సుఖించుభాగ్య మది
నిక్కువమై కనఁగందుమే? యిఁకన్. ౧౭

సీత:-ఓజనపరివాదభీతుకా! సన్నిధినే యుండ నాకొఱ కిట్లు
పరితపింతు వేల?

రాము:-ఓప్రియా! జనకజా! ప్రతివచన మర్థించుచున్నాను.
(మూర్ఛిల్లును)

సీత:-ఏమి! ఆర్యపుత్త్రుఁడు మరల మూర్ఛిల్లెనే! సమాశ్వా
సించెదను. (పటాంచలముచే విసరును.)

రాము:-(చేయి చాచి పటాంచలము గ్రహించును.) ఇది పటాంచల
ముగాఁ దోఁచుచున్నది! ఇది దేని దగునో! (ఆలోచించి)

గీ. జనకదుహితకుఁ దక్క నీజగములోన
నన్యకాంతకు లే దిట్టియమృతశక్తి
నిజపటాంతానిలంబునన్ మేను సొక్క
వీచి రంజింపఁజేయు నేవిధముగన్న. ౧౮

ఆమెను జూచెదను. (కనులు తెరచుచు) అనవరతబాష్పపిహిత
లోచనుఁడ నగుట నాకంటికి కేమియుఁ గానరాకున్నది! ఈ
పటాంచలమును లాగుకొని కన్నీరు తుడుచుకొందును. (అట్లు
చేయును.)

సీత:-(ఉత్తరీయము వదలి) ఆర్యపుత్త్రా! ప్రణయ కోపిదుఁడ
(క్రుద్ధుఁడ?) వగునీవు పరకీయోత్తరీయమున నశ్రువులు
తుడుచుకొనఁగూడదు.

రాము:-(క్రిందఁబడినయుత్తరీయముఁ జూచి) ఒక్క యుత్తరీయమే
కననగుచున్నది. పరిధానకము కానవచ్చుటలేదేమి!
(పరిశీలించి)

గీ. కలితచంద్రికానిర్మోకలలిత మైన
యన్యవనితాంశుకం బిది; యదియు గగన

పరిగళితమైన వెంటనే పట్టినాఁడ
మంచిచెడ్డల నావంత యెంచ కకట ! ౧౯

(మరలఁ బరిశీలించి) ఓహో ! ఆకస్మికముగాఁ జూచి యన్యవనితాంశుక మనుకొంటిని. కాదు. సువ్యక్తమైనది. చిత్రకూటవనదేవత మాయావతి నాఁడు సీత కిచ్చిన దిదే ! ఇది:

ఉ. జూదమునం బణంబు; మరు
సుందరకేళులఁ గంఠపాశము౯;
సాదరసౌఖ్యదాయిసుర
తాంతములందునఁ దాళవృంతమున్
సేదలు దీర్పఁగాఁ; బ్రణయ
సిద్ధము లోకలహంబులందు న
త్యాదరణీయశయ్య; తరు
ణాంశుక మబ్బెను బుణ్యలక్ష్మిచేన్. ౨౦

సీత:-అదృష్టము. ఆర్యపుత్త్రుఁ డానవాలు పట్టఁగలిగెను.

రాము:-ప్రియకుఁ బ్రేమాస్పద మగుదీని నెట్లు సమ్మానింతును? (ఆలోచించి) ఇదియే దీని కనన్యసాధారణసమ్మానవిశేష మగుఁగాక! (కప్పుకొని తన్నుఁ జూచుకొని) ద్వితీయప్రావరణము ధరించిన నన్నుఁ జూచి మునిజను లేమైన నను కొందురు. కాఁబట్టి, నాయుత్తరీయమును దీసివేసెదను. (ఎగురవేయును.)

సీత:-(దాని నందుకొని హర్షముతో) ప్రియము! ప్రియము! చిరజీవిని నై నందులకు నాకిదే మహాప్రసాదము. (ఆఘ్రాణించి) ఆహా! నాయదృష్టమేమి? ఆర్యపుత్త్రునియుత్తరీయ మసంక్రాంత విలేపనామోదకమై యున్నది. సర్వథా రాఘవులు సత్య

సంఘాలు. (కప్పుకొని) ప్రియజనాశ్లిష్టసుఖస్పర్శ మగునీ యుత్తరీయముఁ గప్పుకొని యార్యపుత్త్రవక్షస్థలపరిశ్రాంత నైనట్లు సముద్భిన్నరోమాంచిత నైతిని.

రాము:-(విస్మయముతో) నాయుత్తరీయము భూమిపైఁ బడకుండ నెవ్వరో యపహరించిరి. ఇది నామనోరథమునకుఁ బ్రత్యాసన్న ఫలముగాఁ దలంచెదను. (ఆలోచించి) ఉత్తరీయాపహరణము జలచ్ఛాయను గానఁబడినది. సీత మాత్రము కానరాలేదు. ఐననేమి ? అది సిద్ధాశ్రమ వాసు లగుజనులవలన నామెకుఁ గలిగిన ప్రభావము కానోపును. ఆమె ప్రత్యాసన్నదర్శనోపాయ మేమున్నది? ఓవైదేహీ! పూర్వవృత్తాంత మావంతయుఁ దలపోయవుకదా ! నన్ను దర్శనమాత్రముచే నైనను సంభావింపకున్నావేమి ?

సీత:-ఇప్పుడును బూర్వవృత్తాంతస్మరణమేనా ?

రాము:-

గీ. చిత్రకూటనివాసవిచిత్రవేళ
నీవు కుసుమాపచయమున కేఁగ నేను
నతివ ! వెన్నంటి లీల వస్త్రాంత మూనఁ
బూలు చెదరుట స్మరియింతువే లతాంగి ! ౨౧

సీత:-(నవ్వి) సాహసికా! అందుచేతనే నాకు దూరమైతివి.

రాము:-ఒక్కమాత్రైనఁ బ్రతివచన మీయకున్నది. కారణ మేమో ?

సీత:-దివసావసానసమయ మైనది. ఈయవస్థలో నార్యపుత్త్రుని దేవసహాయునిగా విడుచుట తగదు. ఏమి చేయుదును ?

(చూచి) సరే! ఈతనిప్రియవయస్యుఁడగుకౌశికుఁడు తానేదో వెదకుచున్న వానివలెఁ గౌతూహలసమావేశనిక్షిప్తలోచనుఁడై యిటకే వచ్చుచున్నాఁడు. నే నేఁగుదును.
(నిష్క్రమించును.)
(అంత నేదో వెదకుచు విదూషకుఁడు ప్రవేశించును.)

విదూ:-పూజ్యుఁ డగుమహారా జెక్కడ నున్నాఁడో ? (ముందు చూచి) ఇదిగో ! ప్రియవయస్యుఁ డిటఁ జంతాకుల నిభృతమనోహరాకారముతో దీర్ఘికాతీర మలంకరించి యున్నాఁడు. దగ్గఱ కేఁగుదును. (అట్లు చేసి) జయము! జయము !

రాము:-(చూచి) ఓహో ! ప్రియవయస్యుఁడు కౌశికుఁడు వచ్చినాఁడు. అదృష్టము. వయస్యా ! కౌశికా! ఎచ్చట నుండి రాక ?

విదూ:-ప్రొద్దు పొడిచినప్పటినుండి నిన్ను వెదకుచునే యున్నాను. ఇప్పుడు సాయంకాల మైనది.

రాము:-నీ వంతశ్రమపడి న న్నన్వేషించుటకుఁ గల కారణ మేమి ?

విదూ:-నేఁటియుదయము మునికన్యలు నప్సరోవనితలు విస్రబ్ధసల్లాపముల నుండఁగా నేను మాధవీలతామండపమునఁ బ్రచ్ఛన్నత నుండి నీ కప్రియ మైనతపోవనరహస్య మొకటి వింటిని. అది యభ్యంతరస్థిత మగుగూఢగర్భము వలె న న్నెంతయో బాధించుచున్నది.

రాము:-ఆతపోవనరహస్య మేమి ?

విదూ:-ఓయీ ! నీ వెఱుఁగవా ? ఆపూజ్యురాలు...

రాము:-(చెవులు మూసికొని) అది స్త్రీసంబంధమైనదా? ఐన, విన నక్కఱలేదు.

విదూ:-భయపడకయ్యా! నేను రామవయస్యుఁడను గానా? ఆపూజ్యురాలు పురాణస్వర్గదాసిని నీ వెఱుఁగవా?

రాము:-(తనలో) దేవగణికాసంబద్ధ మగుకథ వినవచ్చును. దోషము లేదు. (ప్రకాశముగా) ఆపురాణస్వర్గదాసి యెవరు? ఊర్వశియా? తిలోత్తమయా?

విదూ:-తిలోత్తమయో సిలోత్తమయో నాకుఁ దెలియదు. కాని, యది చిరకాలవియుక్త యగుసీతాచరిత ననుష్ఠించి ప్రియవయస్యుని బరిహసింపఁ గోరుచున్నది.

రాము:-(తనలో) కౌశికుఁడు నిజముగా నసాధ్యవిషయమే కని పెట్టినాఁడు. కానినాఁడు ప్రియాసన్నిధానాభిజ్ఞములు గానని ప్రియ కనఁబడకుండుట—ఇది మానవసంభావ్యము కాదు. కామరూపిణి యగుతిలోత్తమచేతిలోఁ బూర్ణముగా మోసపోతిని.

గీ. దప్పికంగొని యజ్ఞానతమము గప్ప
గహనమృగతృష్ణను సలిలాకర మటంచుఁ
దలఁచి చోయిలిఁ జూచితి నలఘువాంఛఁ
దృష్ణతీఱఁగఁ గ్రోలెడుదృష్టిఁ దగిలి. ౨౨

(ఉత్తరీయమును జూచి) ఈయుత్తరీయ మెంత నైపుణ్యముతో రచించినది? ఆహా! దాని పరవంచనామహానైపుణ్యము!

విదూ:-ఓయీ! వయస్యా! విలక్షణముఖమునఁ గననగుచున్నావు. అది నిన్నెమైన మోసపుచ్చినదా?

రాము:-ఆ. వంచించినది.

విదూ:-నే విన్నరహస్య మస్యథాకృత మగునా ?

(తెరలో)

మ. తన తీవ్రాంశుమయూఖమాలికలచే
తన్ లోక మల్లార్చి—యా
వనగర్వోన్నతి శత్రురాజవరగ
ర్వంబున్ విదారించి యం
తను వార్ధక్యము గాంచ నెంతయును శాం
తం బంది తా నొప్పుపా
ర్థునిలీలన్—దివసావసానమునఁ జెం
దున్ భానుఁడున్ శాంతమున్. 23

రాము:-(నిరూపించి) ఇదిగో! సూర్యభగవానుఁ డస్తమించు
చున్నాఁడు :

చ. దినకరుఁ డస్తమింపఁగ, ను
దీర్ణవిధంబునఁ జూడ ముచ్చటౌఁ-
బనివడి దూరదేశముల
వర్తిలుభర్తలరాకకై ప్రవా
సినులు దినంబులన్ గణన
సేయఁ గ్రమంబున ముచ్చ్రవేళ్లరీ
తిని-గమలంబులన్ ముడుఁగు
దేర దళంబులు నొక్కటొక్కటై. 24

మఱియు :

చ. అతివిషమప్రసిద్ధ మగు
నస్తగిరీంద్రవిషాణపంక్తియం

దతిచలభాస్కరాశ్వములు
నాఁగక పాఱక లాఁగువాఁగెలన్
సతతనిపీడనాత్మకక
శాహతులన్, స్ఖలితాంఘ్రులై ఖుర
ప్రతతులు ముందు సాఁగమి భ
రంబునఁ జొచ్చెదుఁ బశ్చిమాబ్ధిలోన్. ౨౫

(అందఱు నిష్క్రమింతురు.)

చతుర్థాంకము సమాప్తము.

---

ఓం

శ్రీగురుభ్యో నమః

# కుందమాల

## పంచమాంకము.

(అంత విదూషకుఁడు ప్రవేశించును.)

విదూ:-(తెర కెదురై చూచి) తపోధను లేతెంచుసమయ మైనది. రాజా ! త్వరపడుము.

(తరువాత రాముఁడు ప్రవేశించును)

రాము:-

చ. సవన మొనర్చినాఁడను; గృ
శానున కాహుతి నిర్వహించితిన్;
ప్రవిమలతేజుఁ డయ్యుదయ
భాస్కరుఁ గొల్చినవాఁడ భక్తితో
దివసముఖోచితక్రియలఁ
దీర్చియె వచ్చితి శీఘ్రమే ముని
ప్రవరుల సంయమీంద్రుల శు
భప్రదులన్ గని మ్రొక్కఁగంటకున్. ౧

విదూ:-అదే యాస్థానమండపము. అందుఁ బ్రవేశింపుము.

రాము:-(ప్రవేశించి చింతతో) ఔరా! నిన్నటిదిన మెంతపని జరిగినది! ఆశ్చర్యము !

చ. అతిశయసుప్రసన్నజల
మాట జలంబది కామి దోఁపఁగాఁ

ప్రతికృతి యందుఁ బీనపరి
పాండురగండము లంబకేశ మ
వ్యతికృశదేహముఁ సరసి
జాక్షియుగంబుఁ బ్రసాదరమ్యసం
స్తుత మధురాననంబుఁ గల
సుందరరూపిణిఁ గంటి జానకిన్. ౨

ఒకవేళ నేను తిలోత్తమ చేసినపరిహాసమునే కాంచితినేమో !

మ. హృదయాహ్లాదినికుందమాల యది తా
నే గ్రుచ్చినన్ గ్రుచ్చవ
చ్చు దయన్, సైకతపాదచిహ్నములు న
చ్చో నిల్పఁగా వచ్చు నా
మె దలంపన్, మఱి నీటినీడయును నె
మ్మిం జూపఁగా వచ్చు నా
త్రిదివేశాంగన రామచంద్రుఁ బయఁటన్
దృష్టాత్మయై పిదునే ! 3

విదూ:-(తనలో) ఈతఁడు చింతించుచున్నట్లు తోఁచును. ఇపు డీతనిఁ జేరి నిర్బంధింతును. (చేరి ప్రకాశముగా) ఓయీ ! వయస్యా ! నీ వెచట నుంటివి ? అచట నుండరాదు సుమీ ! నవమేఘస్నిగ్ధశ్యాములుఁడవు, పరిణద్ధముక్తా హారుఁడవు నగుని యింద్రనీలమణిమయములు నత్యంత సమున్నద్ధదురారోహణములు నగుభవనస్తంభములలో నొక్కఁడుగా నిట నాకు హృదయవిభ్రమము గావించు చున్నావు. అందుచే లక్ష్మీనివాసభవనమును సేవాసమ య సముపాగతసామంతనరేంద్ర మధురశబ్దోపగీతమును

నగుసీయాస్థాన దానేరమండపపుండరీకమునకుఁ గర్ణికా మండలమువలె నున్న సింహాసనమునందు మధుమథన నాభీకమలకర్ణికాసమారూఢుఁ డగు పితామహుని మహత్త్వ మధిక్షేపించుచు నుపవిష్టుఁడవు కమ్ము.

రాము:-అట్లే చేయుదును. (కూర్చుండి చింతతో) నే నిపు డభినవ సుఖదుఃఖాదులకు సచేతనుఁడ నైతిని. (ధ్యానమున హృదయముపై హస్త ముంచి)

ఉ. ఇన్నిదినంబులుక్ దరుణి
నిల్వెడలంగను ద్రోసినట్టియా
ఖిన్నతయున్ నిరాశయును
గేవలమున్ మిగులన్, గటా! సుఖం
బన్నది దుఃఖమన్నది హృ
దంతరమందున విస్మరింపఁగా
నిన్నటి యీపరందాకములు
నీడయు నేర్పెను వానిఁ గ్రొత్తగక్. (చింతించును.)

విదూ:-(నిరూపించి తనలో) ఆ! ఈతని యభిప్రాయ మిపుడెఱుఁగఁ గలను. (ప్రకాశముగా) ఓరాజా! ఈయాసనసింహములు గురుతరభారోద్వహన జాతశ్రమములో యనునట్లు ముఖవినిర్గత ముక్తాకలాపవ్యాజమున ఫేనధారలు విడుచుచున్నవి. బాహుయుగళమునఁ బృథివిని హృదయమునఁ బృథివీదుహితను వహించుటచేఁ గాఁబోలును మిక్కిలి వ్రేఁగైతి వని యూహించెదను.

రాము:-(తనలో) సీతాకథావ్యాజమునఁ గౌశికుఁ డిది తెలియఁ

గోరుచున్నాఁడు. పోనిమ్ము! బాల్య మిత్రముగదా! యథార్థవిషయ మితనికిఁ దెలుపుదును. (ప్రకాశముగా) వయస్యా! నిజమే. నే నెడతెగకుండ భూసుతనే తలంచుచున్నాను.

విదూ:-దోషకారణముననా? సుగుణకారణముననా?

రాము:-ఇదియుఁ గా దదియుఁ గాదు.

విదూ:-ఈరెండును గాక సీమంతినుల నేల తలఁతురు?

రాము:-కారణానురోధి యగుప్రేమావేశ మన్యదంపతుల విషయమున. సీతారాముల దట్టిది కాదు!

చ. అతిశయకష్టసౌఖ్యముల
యందు నసూచ్యము గాఁగ వ్యక్తమై
వితతముగాఁ బరస్పరప
విత్రహృదంబుజముల్ గ్రహింపఁగా
సతతము దోషసద్గుణవి
చారణ లేక స్వభావసిద్ధమై
సతిమదియందు నామదిని
సంస్థితముల్ ప్రణయానుబంధముల్. ౫౬

విదూ:-అలీకమధురవచనములతో నస్మాదృశుని వైదేహిని మోసగింపఁజూడకు. దేవి లేకున్న నీకుఁ గాలక్షేపమగు చుండుట లేదా?

రాము:-ఏకాంతమున రాముఁడు సీతానిరపేక్షుఁ డని నీవను కొన్నది తప్పు:

మ. అనురాగంబులు మానసస్థములు; బా
హ్యస్ఫూర్తికిన్ గర్కశం

బని తోఁచున్ గనుఁగొన్నవారలకు నా
దామానసం, బెన్నఁగా
జనితానంతరసార్ద్రిభావములకున్
స్థానంబు, తద్భావముల్
మొనయుంబో బిసతంతుసూక్ష్మలలితం
బుల్ గాఁగఁ బూజ్యంబులై. ౬

విదూ:- మహాసముద్రభగవానుఁడు బడబానలముచే నాత్మ మహత్త్వము గోల్పోవునట్లు నీవును బ్రబలహృదయ సంతాపమునఁ గృశించుచున్నావు. ఇఁక, నేనును స్వభావ లఘుత్వముచే సీతాస్థితిని దలంచుకొని దవానల పరి శుష్య మగుతుషారబిందువువలె నిర్విశేషుఁడ నగు చున్నాను. (ఏడ్చును.)

రాము:-సీత స్మరణయోగ్యయే యని తలఁచువాఁడవునీ వానాఁ డేల యామెను బరిత్యజింపవల దని చెప్పవైతివి?

విదూ:-ప్రసాదసుముఖుఁడైనప్రభువుతో నేమేని విన్నవించు కొనుటకే జనులు జంకుదురు. ఇఁకఁ, గోపభీషణునితో నెవ రేమి చెప్పఁగలరు?

రాము:-వయస్యా! మాదృశులు తాదృశకోపావస్థావగాహులు కారు. ఎట్లు వర్తించుచున్నను సుహృదయుల కనా శ్రయులుఁ గారు:

క. నరపతులు మేరమీఱిన
నురుబుద్ధులు సచివు లడ్డుటొప్పును భువి భా
స్కరకరసహస్రతీక్ష్ణత
గురుమేఘుం బడ్డి సుఖముఁ గూర్పదె ప్రజకున్. ౭

వయస్య! వర్తమానసీతాకథ మనయుభయులకును సంతాపకారణము. కావున, నీవు ప్రతీహారభూమి కరుగుము. "తపోధనులు విచ్చేయుసమయ మైనది. సర్వద్వారములును సంభృతవేత్రములు గావింపుఁ" డని దౌవారికుల కాజ్ఞాపింపుము.

విదూ:-ఓరాజా! కందమూలఫలాశనులు, వల్కలపరిధానులు, నుద్దండదండధరులు నగువీర లింతయధికాదరసంభావనీయు లగుట కెంతటివారు?

రాము:-నీ కిట్టి సందేహము కలుగవలసినది కాదు. మూలస్వయోగమూల సకలపురుషార్థసంవేదినిగదా జ్ఞాననివృత్తి! చూడుము:

గీ. నిత్య మాభ్యంతరం బయి నెగడుజ్యోతి
సత్యసంస్థితిఁ బ్రకటింపఁ జాలి మఱియు
వెలుఁగునే పూజ్యపాదదీపితము గాక
పవనుచేతఁ గదా యగ్ని వ్యవహరించు. ౮

విదూ:-తపోధనసమాగమము మహార్థప్రదమే యగుచో నేను వెంటనే పోయి నీయాజ్ఞప్రకార మొనరించి వచ్చెదను. (నిష్క్రమించి మరలఁ బ్రవేశించి) హీ! హీ! నీ వన్నప్రకారము నేను బ్రతీహారముకడ కేఁగితిని. అచట సుస్నిగ్ధశ్యామలతనులు, ననుద్భిన్నతారుణ్యవిగ్రహులు, బాలభావముచే మంగళాంకురశంకావహులు, ననమాప్తప్రమాణులు, నప్రమత్తులు, రూపసౌభాగ్యమునఁ గందర్పదారకాకృతులు, సాలతరూచ్ఛ్రితరులు, మహాబలులు, నత్యంతలలితాంగులు, ప్రస్పందులు, నత్యంతధీరులు, నసంక్షేపితులు, లోలతరులు, నగు నిరువురు తాపస

కుమారులు కలాదర్శనాపేక్ష నాగతులై తోరణ
స్తంభముకడ నుండఁగాఁ జూచితిని.

రాము:-(సాకూతముగా) వారికి నానయనసీమావతరణప్రతి
బంధక మేమి ?

విదూ:-బాలభావలలితులు, కౌతూహలసంబద్ధులు నగువా
రిరువురు నా కుపన్యసించినపలుకులు వినుము.

రాము:-చెప్పుము. చెప్పుము.

విదూ:-వారు వాల్మీకిభగవానుని శిష్యులఁట. వీణాకలాప్రవీణు
లఁట. అపూర్వవిజ్ఞాను లఁట. మఱియు వారిట్లు
చెప్పిరి: "రాజర్షి జనుల మగుమాకుఁ దపోధనబహు
మానముగా భూస్థానమే యాసనముగా నొసంగవల
యును. దుష్కరవిన్యాసము, మహాకవిసంగ్రథిత మహా
పురుషచరిత్రబంధము, మహార్థగంభీరము, నశ్రుత
పూర్వాగమము,గాంధర్వవేదసంవాది,సరసము, యోగ
విరచితవర్ణరమణీయము,వీణాతంత్రీరసితానువిద్ధము, నగు
గీతముపాడి యాపిమ్మట విజ్ఞానవిశేషప్రసన్నహృదయుఁ
డగురా జేమి చేయునో యాయావద్వృత్తాంతము
చెప్పవలయు నని వాల్మీకులు మా కాదేశించిరి."

రాము:-ఆహా! బాలకులవిజ్ఞానావలేపము! శౌండీర్యగర్భితో
పన్యాసము! వయస్యా! 'మీ యభిమతముప్రకారమే
చేయుదు' మని చెప్పి వెంటనే వారిని గొనిరమ్ము.
విలంబము చేసితి వనువిసువుసఁబరాఙ్ముఖులగుదు రేమో!

విదూ:-వారికి విసువు కలుగదు. వారి యన్యోన్యవాత్సల్యము,

నాకారసాదృశ్యము, కాకపక్షపరిభూషితవదనములు చూడఁగా దశరథమహారాజు జీవించియున్నప్పుడు రామలక్ష్మణు లిట్లే యుండి రాజాస్థాన మలంకరించెడు వారని నీబాల్యమును, దశరథుని దలఁచుకొని, బాష్పపూరితనయను లగుసౌవిదల్లులు తమతో భాషించుచుండఁగా వారు సుఖమునఁ గూర్చుండియున్నారు.

రాము:-వారియాకృతి నాశైశవానుకారిణియా ?

విదూ:-కాక మఱేమి ?

రాము:-నాకుతూహల మతిశయిల్లుచున్నది. శీఘ్రమే వారిని బ్రవేశపెట్టుము.

విదూ:-అట్లే. (నిష్క్రమించును.)

(తరువాత విదూషకుఁడు దారి చూపఁ దాపసు లగుకుశలవులు ప్రవేశింతురు)

విదూ:-ఆర్యులారా ! ఇటు ! ఇటు !

(నడతురు)

కుశు:-(అపవారించి) వత్సా! లవా ! ఇప్పుడే వాల్మీకి భగవానుని యాదేశమున నమ్మకు నమస్కరించి పార్థివభవనాభిముఖుఁడనై నేను బోవుచుండఁగాఁ గాకపక్షగ్రహణసంజ్ఞచేఁ బర్ణశాలకుఁ గొనిపోయి యమ్మ నీకు రహస్యముగాఁ జెప్పినసంగతి యేమి ?

లవు:- వేఱువిషయ మేమియు లేదు. అప్పుడు తాపసులతో నిండియున్న పర్ణశాలలోనికిఁ దీసికొనిపోయి యమ్మ నన్ను గట్టిగా నదిమి కౌఁగిలించుకొని సీత్కారలక్షితస్మితమధురముగా శిరము మూర్కొని నెమ్మదిగాఁ గర్ణపత్రము సవరించుచుఁ దన మోము నా మోమునఁ జేర్చి "వత్సా!

మీఁదు స్వాభావికావలేపముఁ బరిత్యజించి మహారాజు నకు నమస్కరింపుఁడు. కుశల మడుగుఁడు" డని యుప దేశించినది.

కుశు:-కుశలప్రశ్న మడుగవచ్చును. కాని, ప్రణామము చేయు టెట్లు ?

లవు:-అట్లనుట యుక్తము కాదు.

కుశు:-మనవంశమువారు నమస్కరించువారు కారఁట !

లవు:-నీ కెవరు చెప్పిరి ?

కుశు:-అమ్మ.

లవు:-నమస్కరింపుఁ డని యామెయే చెప్పినది. గురునియోగ ములు విచారణానర్హములు.

కుశు:-సరే ! అట్లే కానిమ్ము ! ముందర నిటఁ గాలోచిత మను ష్ఠింతము.

(నడతురు)

విదూ:-ఆర్యులారా ! ఇటు ! ఇటు !

రాము:-(విలోకించి) నిజముగా నీబిడ్డలు నాబిడ్డలే ! కౌశికుఁడు చూపుచున్నదారిని వారిచే వచ్చుచున్నారు. ఏమి ! నన్ను నేను మఱచుచుంటిని !

గీ. బాలు రెవ్వరో నే నింతవఱ కెఱుంగ
వీరియాకూత మావంత వినఁగ లేదు
చూపుమాత్రముచే హృది చూఱగొనిరి
నిండె బాష్పాంబుధారలు నేత్రములను.

ఐన నిం దాశ్చర్య మేమి ?

చ. తెలియకయుండియే హృదయ
దీప్తము తైసబుణానుబంధముల్
కలయికచే వచస్సులను
గాంచుటచే నొకయుక్తిచేతనే
విలసితముల్ విలగ్నములు
విద్రవముల్; మఱి చంద్రకాంత మే
తెలివిని దోషసద్గుణవి
తీర్ణత నీరగుఁ జంద్రుపుట్టుకన్. ౧౦

వీరిరూపము లెట్టివో నిర్ణయించెదను. ఏమి ! చూడనైనఁ జాల కున్నాను ! ఈకుమారులఁ జూచుకొనుటకంటె నధికతరముగా నా హృదయ మననుభూతపూర్వ సాధ్వసప్రహర్ష శోకానుక్రోశసం భేదచిత్రావస్థా విశేషము నంది మూర్ఛవలెఁ దిరోహిత మగు చున్నది. (మూర్ఛిల్లి లేచి) ఏమీ ! ఈ బాష్పప్రవాహము ! నా హృదయస్తంభము దీనివలన స్వస్థమయి ప్రశాంతి నందినది. వ్యపనీత బాష్పవ్యవధానము లగు కనులతో మరలఁ జూచెదను. (చూచి) సన్నివేశము గంభీరోదారము; వేషరచనము ప్రశాంత మనోహరము, అభిక్రాంతము వినయోదయోదాత్తము; ఈయు గళము కులీన మగుట సువ్యక్తము.

విదూ:-ఈయనయే మహారాజు. మీయభిప్రాయానుసారముగా దగ్గఱ కేఁగుఁడు.

కుశు:-వత్సా ! లవా! నే నిప్పుడు చెప్పిన ప్రణామసంబంధము నీకుఁ దెలిసినదా ?

లవు:-ఐన, నిప్పు డేమి వచ్చినది ?

కుశు:-నే నీరాజును సమీపించుకొనుటకంటె నధికముగా హృదయో

త్కంపమై సాధ్వసమున వివశాంగుఁడ నగుచున్నాను. ఎందుచేతనో తుల్యావలేపనము పరిత్యజించితిని. ఈతని కవనతము గాకుండ శిరమెత్త వీలు గాకున్నది. వేయేల! నమస్కరింతును.

లవు:-నావలెనే యన్నయుఁ బరవశుఁడైనాఁడు. (ఇరువురును నమస్కరింతురు.)

రాము:-వలదు. వలదు. మీరు మర్యాదను మీఱవలదు. ఏల నమస్కరింతురు? బ్రహ్మశిరోనతుఁడ నైతిని. కష్టము కదా! (విషాద మందును.)

విదూ:-ఏల విషణ్ణుఁడ వయ్యెదవు? వీరిప్రణామమును నీవు ప్రతిగ్రహింపలేదుకదా! కాన, నీకు హాని లేదు.

రాము:-కౌశికుఁడు చక్కఁగాఁ జెప్పినాఁడు. దాక్షిణ్య విశేష పేశితు లగు నార్యులారా! వినుఁడు :

ఉ. ఆకులపాటుతోఁడ నయ
నాంబుజముల్ వికసింప నాదలన్
నాకయి మీ రొనర్చిన ప్ర
ణామపరంపర నాయనుజ్ఞచే
మీకులభర్త మీగురు న
మేయపవిత్రపదాంబుజంబులన్
సోకునుగావుతన్! హృదయ
శుద్ధి నొసంగుమహోపహారమై. ౧౧

విదూ:-ఇదియే యీ ప్రణామపరిణామ మని ప్రియవయస్యుఁ డప్రతిహతశాసనుఁ డైనాఁడు.

కుశలవులు:-(వంచిన తలలెత్తి) మహారాజునకుఁ గుశలమా ?

రాము:-మీదర్శనమునఁ గుశలమే. మీకు నే నిట నతిథిసభాజనోచిత కంఠగ్రహణమునకే కాని, కుశలప్రశ్నమునకు భాజనుఁడను గాను. (కౌఁగిలించుకొని) అహో ! ఈస్పర్శము హృదయగ్రాహి కదా ! (ఆలోచించి) పుత్త్రగాత్రపరిష్వంగసుఖము నా కనభిజ్ఞము. ఐన, నా కట్టియానందము కలిగినది. గృహమేధులు తపోవనపరాఙ్ముఖు లగుచుండు టెంతయు నుచితమేకదా ! (ఆసనార్ధమునఁ గూర్చుండఁబెట్టుకొనును.)

ఇరువురు:-(అనిచ్ఛాసూచకముగా) రాజా! అతిదాక్షిణ్యము వలదు.

రాము:-మీ రీశాలీనత విడువుఁడు.

గీ. బాల్యగుణమున, గుణమునఁ బ్రౌఢులైన
వారికిని మాననీయులే మీరు చూడ;
బాలభావమునను శూలిమౌళియందుఁ
గేతకచ్ఛదతను గాంచి కెరలె విధుఁడు. ౧౨

(కన్నీళ్లు పొరల మరలఁ గౌఁగిలించుకొని విదూషకునితో) నిర్వాసితయగు సీతను విడిచి యిప్పటి కెన్నిసంవత్సరములైనదో నీకు జ్ఞాపకమున్నదా ?

విదూ:-(ఆలోచించి) ఆ ! జ్ఞాపకమున్నది. మందభాగ్యుఁడను. (హస్తాంగుళి ప్రమాణసంఖ్యను గణించి పైఁగాఁ గాలివ్రేళ్లనుమూఁడింటిని లెక్కించి) ఎందు కింత లెక్క? సీతాదేవిని స్వహస్తములతోఁ బరిత్యక్తఁ జేసి యిప్పటికిఁ బదవయేఁడు.

రాము:-(కుమారులఁ జూచి) సీత సుఖప్రసవమై మగపిల్లలను గనియే యున్నయెడల నిప్పటికి వా కీవయసున నుందురు.

విదూ:-అయ్యో! ఆమెయజ్ఞాతవిప్రయుక్తవృత్తాంతముచే మంద భాగ్యుఁడ నగునేను స్తంభించితినిగదా ! (ఏడ్చును.)

రాము:-ఈ తాపసకుమారావలోకనమున నేను ననహ్యవేద నావస్థ నందుచున్నాను !

చ. చిరతరవిప్రవాసి తన
చిన్నిసుతుండు గృహంబులోన నే
కరణియవస్థలం బడుచుఁ
గాఁజియ నందునటంచు నెంచు నా
కరణియవస్థలం గుడువఁ
గాఁ గని సన్నిధి నన్యపుత్త్రినిఁ
గరుణరసప్రవాహ మనఁ
గా నతఁ డెంత ద్రవించిపోవునో ! ౧౩

విదూ:-(సంభ్రమమున) విడువుము. విడువుము. సర్పము.సర్పము. తపస్విబాలురు బ్రదుకుదురుగాక ! సింహాసనమునుండి దిగుదురుగాక !

రాము:-(సంభ్రమమునఁ గుమారుల విడుచుచు) వయస్యా ! ఏమిది ?

విదూ:-సాకేతనివాసు లగుచిరజీవులనోట రఘువంశేతరు లీ సింహాసన మధిష్ఠించిన వారితలలు వేయివ్రక్కలగు నని వినియుంటిని.

రాము:-(ఆవేగముతో) శీఘ్రముముగా దిగుఁడు.

(ఉభయులు దిగి నేలను గూర్చుండురు.)

రాము:-మీరు స్వస్థులేకదా ! మీశిరముల కేవికారము లేదు కదా !

ఉభయులు:-మేము స్వస్థులమే. మాశిరముల కేవికారమును లేదు.

విదూ:-ఆహా! ఆశ్చర్య మాశ్చర్యము! ఈకుమారు లక్షతప్రకృతిస్థ శరీరులై కూర్చున్నారు !

రాము:-ఇం దాశ్చర్యమేమి? (కుమారుల నిర్దేశించి) తపశ్శరీరములు స్వాస్త్యయనపరిగృహీతములుగదా ! చూడుము :

గీ. ఘనతపోవర్మ లైనట్టిమునులయెడను
శరపరంపర మోఘమై తిరిగిపోవు;
వాసవునివజ్రధారలు వారిఁ దాఁకి
కుంఠితములై మహాశక్తిఁ గోలుపోవు. ౧౪

(కుమారులఁ జూచి) ఏమి? మీరు వ్యవధానరహిత మగుభూమిపైఁ గూర్చుండిరి ?

ఉభయులు:-మహారాజా ! ఈయర్థము ప్రథమపరిశీత మేకదా !

రాము:-ఔను.

విదూ:-ఓరాజా! వీరతిథులు. సంభాషణాతిథేయమునోసంగుము.

రాము:-కుమారులారా! ఈమీసౌందర్యమును గాంచినఁ గలిగినకుతూహలముతోఁ బ్రశ్నించుచున్నాను. మీజన్మదీక్షలచే నలంకృతము లగువర్ణాశ్రమము లేవి ?

కుశు:-(సంజ్ఞచే లవుని దెలుపు మనును.)

లవు:-వర్ణము ద్వితీయము; ఆశ్రమము ప్రథమము.

రాము:-మీ రగ్రజన్ములు కారా? అగుచోఁ బ్రణామప్రయోగన్యూనాసనపరిగ్రహము లల్పాపరాధములే కదా! ఇఁక,

క్షత్రియకులపితామహు లగుసూర్యాచంద్రమసులలో
మీ వంశకర్త యెవరు ?
లవు:-సూర్యభగవానుఁడు.
రాము:-ఓహో ! మాతో సమాను లగునభిజను లైనారే !
విదూ:-మీయిరువురది యొకే ప్రత్యుత్తరమా ?
రాము:-మీయిరువురకుఁ గల రక్తసంబంధ మేమి ?
లవు:-ఏకగర్భజనితుల మగునన్నదమ్ములము.
రాము: ఇరువురు సమానాకారులు. వయసున భేదమే కానరాదు.
లవు:_మేము కవలము.
రాము:-ఇపుడు యుక్తమే. మీలో నెవరు పెద్దలు ? పేరేమి ?
లవు:_(అంజలి నిర్దేశించి) ఆర్యులపాదపూజనసమయమున లవుఁడ
నని వినిపింతును. ఆర్యులగురుచరణవందనసమయమున
...(అపరిసమాప్తిఁ జూపును.)
కుశు:-...నేను కుశుఁడ నని వినిపింతును.
రాము:-ఆహా ! సముదాచార ముదాత్తరమ్యముగదా !
విదూ:-పేరు తెలిసినది. కాని, పెద్ద యెవరో తెలియలేదు.
రాము:-అంజలినిర్దేశమున ననామగ్రహణమున, కుశుఁడే పెద్ద
యైనట్లు ప్రత్యుత్తరముగదా !
విదూ:-ఇపుడు సరిగాఁ దెలిసినది.
రాము:_మీగురువుగారి పేరేమి ?
లవు:-వాల్మీకి భగవానుఁడు.
రాము:-ఏ సంబంధమున ?
లవు:-ఉపనయనోపదేశమున.
రాము:-మీశరీరదాత యగుపితపేరు తెలియఁగోరుదును.

లవు:-నాకుఁ దెలియదు. ఈతపోవనమున నెవరు దానిని వ్యవహరింపరు.

రాము:-ఓహో ! మాహాత్మ్యము !

కుశు:-ఆ పేరు నాకుఁ దెలియును.

రాము:-చెప్పుము.

కుశు:-నిరనుక్రోశుఁడు.

రాము:-(విదూషకునిఁ జూచి) ఈనామధేయ మపూర్వముకదా !

విదూ:-(ఆలోచించి) ఇట్లడిగెదను. (ప్రకాశముగా) నిరనుక్రోశుఁడని యెవరందురు ?

కుశు:-అమ్మ.

విదూ:-కోపముతో నున్నప్పుడా ? లేక సహజముగానేనా ?

కుశు:-బాల్యచాపలమువలనిమాయవినయముఁ గని—నిరనుక్రోశుని పుత్త్రిలారా ! చాపలము వలదని- మ మ్మధిక్షేపించును.

విదూ:-వీరితండ్రి నామధేయము నిరనుక్రోశుఁడు. ఆతఁడు వీరి తల్లి నవమానించి ప్రవాసినిఁ జేయఁగా నామె యేమియుఁజేయలేక పుత్త్రిల నీనామమున బెదరించును.

రాము:-కౌశికా ! చక్కఁగాఁ గనిపట్టితివి. (నిట్టూర్పు విడిచి) ఛీ! నే నెట్టివాఁడను ! ఆతపస్విని నాయపరాధమూలమున మన్యుగర్భితాక్షరములతో బిడ్డల నిట్లు బెదరించుచున్నది. (బాష్పనేత్రములతోఁ జూచుచు)ఆనిరనుక్రోశుఁడు మీయాశ్రమమున నున్నాఁడా ?

లవు:-లేఁడు.

రాము:-(సంభ్రమముతో) వినఁబడుచున్నాఁడా ?

లవు:-(కుశుని జూచును.)

కుశు:-ఆయన పాదములు మాకు నమస్కృతపూర్వములు కావు. కాని, యమ్మయొకవేళ యాతని సచీవు డనుటం దెలుపును.

రాము:-ఆనిరనుక్రోశుం డెప్పుడైన మిమ్ముం గౌంగిలించుకొన్నాడా?

కుశు:-అదియును లేదు.

రాము:-నాయతిదీర్ఘప్రవాసము దారుణము! ఇంతకాల మన్యోన్యాలోచనగోచరులు కాకపోవుట మఱింతదారుణము. (విదూషకుని జూచి జనాంతికముగా) వీరితల్లి యెవరో తెలియం గుతూహలుండను. స్త్రీవృత్తాంత మడుగుట నాకయుక్తము. విశేష మీతపోవనమున. ఉపాయాంతర మేమి?

విదూ:-(జనాంతికముగా) అప్రతిహతవచనమహత్త్వము గలది బ్రాహ్మణజాతి. కాన, నే నడిగెదను. (ప్రకాశముగా) ఓయీ! మీయమ్మపే రేమి?

లవు:-ఆమెకు రెండుపేరు లున్నవి.

విదూ:-ఏవేవి?

లవు:-'దేవి' యని తపోవనవాసులు 'వధు' వని వాల్మీకి భగవానుఁడు పిలుతురు.

రాము:-వాల్మీకిముని పల్కినవధూశబ్దమున నేక్షత్రియకులము వర్ధిల్లునో?

విదూ:-క్షత్రియకుల మతివిస్తీర్ణము. ఏక్షత్రియకులమో తెలియదు.

రాము:-వయస్యా! ముహూర్తమాత్ర మిటు రమ్ము.

విదూ:-(వచ్చి) ఏమి యానతి?

రాము:-ఈకుమారులది మాది కుటుంబవృత్తాంత మేకాకార
మున నున్నది కదా ?

విదూ:-ఎట్లు ?

రాము:-చూడుము: వీరికిని సీతాగర్భమునకును గాలాతిపాతము
తుల్యము; వీరును క్షత్త్రియులు; సూర్యవంశజులు;
అజాతప్రోషితులు; రాజాసనారోహణమున నిర్వికా
రులు; వీరిజనకునికి దారుణత్వసూచకసిరనుక్రోశశబ్దము;
తల్లికి మాహాత్మ్యవిభావన దేవీశబ్దము; ఈసాదృశ్య
బాహుళ్యమున మందభాగ్యుఁడఁ జాలఁ గలఁత నందు
చున్నాను. (వైక్లబ్యము నందును.)

విదూ:-ఈబాలురు సీతాగర్భజనితు లనియా నీయభిప్రాయము ?

రాము:-అయ్యో! ఎట్లు? తపోవనవాసు లగుజనమునం దెట్లీ
సంబంధ మారోపింపఁగలను ? కాని, వీరు :

గీ. వయసుచే, నన్వయంబునఁ, బ్రథితమైన
తనువుచేఁ, గష్టదశచేత, జనకజాత్మ
లగుటఁ దలఁపించి నామన మధికముగను
జంచలింపంగఁజేసిరీసమయమందు.(చింతాశోకములందును.)

(తెరలో)

ఓయీ! ఇక్ష్వాకుకుమారు లగుకుశలవులలో నెవ రిచ్చట ?

ఉభయులు:-(విని) ఇరువుర మిచ్చటనే యున్నాము.

(మరలఁ దెరలో)

ఏమి ? నియోగ మింతసే పేల యుపేక్షింతురు ?

శా. శ్రీవాల్మీకిబుషీశ్వరుండు రచియిం
చెన్ బుణ్యసంపన్నమై

యావిశ్వార్కము వెల్గఁగా దశరథా
ఖ్యానంబు దానిక్ భవ
త్ప్రావీణ్యంబును జూపుచున్ రఘువర
ప్రహ్లాద మౌనట్లు నేఁ
డో వత్సల! వినిపింపుఁ డేమఱకుఁడీ
యుష్మత్క్రియాజాలముక్. ౧౬

ఉభయులు:-రాజా! ఉపాధ్యాయదూత మమ్ము వేగిరపెట్టుచున్నాఁడు.

రాము:-మహార్థసంవిధాయి యగుమునినియోగము నాకును సంభావనీయమే.

ఉ. గాయకు లెన్న మీరు; కవి
కావ్యకళానిధి సద్వ్రతప్రథా
నాయతమూర్తి యాదికవి;
యశ్రుతపూర్వమహాప్రబంధ మా
శ్రీయుతపద్మనాభునిప్ర
సిద్ధచరిత్రము; శ్లాఘనీయమై
శ్రేయ మొసంగు శ్రోతకును
సిద్ధ మొసంగు మనోనుమోదముక్. ౧౭

వయస్యా! ఇది మానవులలోని యపూర్వమగుసరస్వత్యవతారము కదా! సుహృజ్జనసాధారణ మగుదీనిని నేను వినఁగోరుచున్నాను. సభాసదులను సన్నిధులఁ జేయవలయును. సౌమిత్రిని బిలువనంపవలయును. నేనును వీరిచిరాసనపరిఖేదమును బాదవిహారణముచేఁ బరిహరించెదను. (అందఱు నిష్క్రమింతురు.)

పంచమాంకము సమాప్తము.

---

ఓం

శ్రీ గురుభ్యో నమః

# కుందమాల

## షష్ఠాంకము.

(అంతఁ గంచుకి ప్రవేశించును.)

కంచు:-కౌశికునిమూలమున రాజాజ్ఞను గ్రహించి నిర్వర్తించితిని. ఇచట నున్న ప్రభువు నవలోకించెదను. (విలోకించి) స్వామి విచ్చేసి రిదిగో !

గీ. పుణ్యపురుషులు మువ్వురు ముందు నడువ,
మూఁడువేదంబులుం గొల్వ ముందు వచ్చు
నశ్వమేధాధ్వరం బన నతిశయించి
స్వామి యిటె వచ్చుచుండె నుత్సాహ మెసఁగ. ౧

(అంత రాముఁడు లక్ష్మణునితో, కుశలవు లనుగమింపఁ బ్రవేశించును.)
అందఱు నడతురు)

కంచు:-(సమీపించి) ఆర్యా! జయము. ఇదిగో! ఆస్థానమండపము సజ్జిత మైనది. ఇదే యాసనము. (అందఱుఁ గూర్చుందురు.)

కంచు:-దేవా! ఇదె! చూడుము. వీరే రాఘవులు; పౌరజానపదులు; దేవరవారిని సంభావించెదరు.

రాము:-(చూచి) తెరచే నాకుఁ గనపడకుండ నున్నవీ రెవరు ?

కంచు:- గీ. ఈమె కౌసల్య; కైకేయి యీమె; మఱి సు
మిత్ర యీమె; దేవేరులు మీజననులు;

భరతలక్ష్మణశత్రుఘ్న భార్య లివలి
ముప్వురును దేవ! కంటివే పుణ్యవతుల. ౨

లక్ష్మ:-(కంచుకితో) ఆర్యా! దేవేరులలోఁ గాని కోడండ్రలోఁ గాని వైదేహి లెక్కకు రాలేదే!

రాము:-(నిట్టూర్చి) కంచుకీ! నీస్థానమునకు నీవు పొమ్ము.

కంచు:-చిత్తము. (నిష్క్రమించును.)

రాము:-ఆర్యులారా! ప్రారంభింపుఁడు.

కుశలవులు:-

గీ. అంత దశరథనామభూకాంతుఁ డలరి
మదిని, కౌసల్య కైకేయి మఱి సుమిత్ర
నతిసుమధ్యల ముప్వురుసతుల ధర్మ
పత్నులనుగా వరించి యుద్వాహ మయ్యె. 3

రామలక్ష్మణులు:-(సంతోషముతో) కవి తండ్రినే కథానాయకుని జేసెను.

(ఉభయులు నమస్కరించి యాసనములు దిగుదురు.)

కుశలవులు:- గీ. గర్భములు దాల్చి, కౌసల్య కనెను రాము;

లక్ష్మ:-(నమస్కరించును.)

కుశలవులు:- భరతునిం గనెఁ గైకేయి; పరమహర్ష
మొదవఁ జేయ సుమిత్ర యాపిదపఁ గవలఁ
గనియె లక్ష్మణశత్రుఘ్ను లనుసుతులను. ౪

రాము:-(లక్ష్మణుని కౌఁగిలించుకొనును.)

కుశలవులు:-

గీ. రామచంద్రుండు సీతను రమణమీఱ
లక్ష్మణుం డూర్మిళాకన్య లలితముగను

మాండవీశ్రుతకీర్తుల మహిం గ్రమమున
భరతశత్రుఘ్ను లెన్న నుద్వాహమైరి. ౫

గీ. బాల్యయౌవనమధ్య మగువయసునందు
వఱలుచుండిన యారాజవరకుమారు
లాత్మభార్యల ననురాగ మతిశయింపం
గనిరి బుద్ధివికార ముత్కంఠకలన. ౬

లక్ష్మ:-రమణీయము.

రాము:-కాలాతిపాతము వలదు. గానము చేయుండు:

గీ. జరవలనం దాతపాదులశిరము నరసెం;
గాకపక్షశిరంబులం గంటి మేము:
అపుడు సాకేతనందనోద్యానవృక్ష
తతులు గాంచెను జానుదఘ్నతను; బిదప. ౭

కుశలవులు:-

గీ. అపుడు రామాభిషేకార్థ మఖిలవస్తు
సమితి సిద్ధంబుగా నున్నసమయమందు
మాతులుని జూడ శత్రుఘ్నమైత్రిం గూడి
భరతుం డరిగె మాతామహుపురమునకును. ౮

రాము:-(తనలో) నిశ్చయము. మధ్యమాంబ నిందిత యగు.
(ప్రకాశముగా) ఈకథ పట్టు దాటించి సీతాపహరణము
నుండి గానముచేయుండు.

కుశలవులు:-

గీ. శూర్పణఖ మూలమున సీతసుందరతను
బంక్తికంఠుండు వినినంతం బటుతరాశ

నపహరించె సీతాదేహ మంతెకాని
యపహరింపఁగలేఁ డయ్యె నామెచరిత. ౯

లక్ష్మ:-(రామునిఁ జూచును)

కుశలవులు:-

గీ. వారినిధి సేతువుం గట్టి పంక్తికంఠు
సపరివారంబుగా యమసదన మంపి
సీతఁ దోడ్కొని రాముండు శీఘ్రముగను
వచ్చి చేరెను సాకేతవరపురంబు. ౧౦

రాము:-చక్కని సంక్షేపము!

కుశలవులు:-

గీ. ప్రాప్తరాజ్యుండు నౌరామభద్రుఁ డంత
నించుకజనాపవాదంబు నెంచి మదిని
మంతనంబున లక్ష్మణు నంతఁ బిలిచి
యడవి సీతను విడువఁగా నాజ్ఞచేసె. ౧౧

గీ. బాష్పపర్యాకులేక్షణఁ బడఁతి సీతఁ
గడుననాథను వైక్లబ్యకలిత నబలఁ
బుణ్యగర్భంబునన్ రఘుపురుషదివ్య
సంతతి వహించుబహుపుణ్యసాధ్విఁగానుచు. ౧౨

గీ. నిర్జనారణ్యమందు ననేక ఘోర
మృగకులాకీర్ణభూమిని మేదినీశు
ననుఁగుఁదమ్ముండు లక్ష్మణుఁ డాక్షణంబ
జనకజాతను విడనాడి చనియెఁ బురికి. ౧౩

లక్ష్మ:-అహో! లక్ష్మణుఁ డయశోభాగి యయ్యెఁగదా!

రాము:-నీయపరాధ మేమున్నది? ఇది రామపరాక్రమముగానే గ్రాహ్యము. పిమ్మట?

కుశలవులు:- మాగీత మింతతో సరి.

రాము:-(ఉద్వేగముతో) సౌమిత్రీ! కష్టము ప్రాప్తించెఁగదా!

గీ. అంత జనకాత్మజాత నిరాశచేతఁ
బ్రాణములు వీడియుండఁగా వచ్చుఁ గాన
నప్రియాఖ్యానభీతిచే నవలికథను
సంహృతము చేసియుండఁగాఁ జనుసుకవియు. ౧౪

కుశు:- (అపవారించి) ఈమహాభాగులు సీతావృత్తాంతముచే నత్యంత విషాదము నందుచున్నారు. కావున నడిగెదను. (లక్ష్మణునితో) రామాయణ కథానాయకు లగురామ లక్ష్మణులు మీరేనా?

లక్ష్మ:-క్లేశభాగుల మగుమేము వారమే!

కుశు:-సీత నీచే నీతయా?

లక్ష్మ:-(లజ్జతో) మందభాగ్యుఁడ నగునాచేతనే.

కుశు:-సీత రాముని ధర్మపత్నియా?

లక్ష్మ:- ఔను.

కుశు:-సీతవిషయముకాని యామెగర్భవార్త కాని మీకేమేని దెలిసినదా?

లక్ష్మ:-మీసంగీతముననే తెలిసినది.

రాము:-ఇఁకముం దేమేనికల్యాణవిషయము తెలుపునా? (ఆలోచించి) వీరి ని ట్లడిగెదను. (ప్రకాశముగా) ఆర్యులారా! ఇది మీయాగమావధియా? ఈగ్రంథసందర్భావధియా?

కుశుః-మాకుఁ దెలియదు.

రాముః-కణ్వుని గనుఁగొందము. సౌమిత్రీ! కణ్వుని బిలుపుము.

లక్ష్మః-(నిష్క్రమించి కణ్వసహితుఁడై మరలఁ బ్రవేశించును.)

కణ్వః-(విలోకించి)

గీ. ఇతఁడు నయనాభిరాముఁడౌ; నిరుగడలను
జనకజాత్మజుల్ గొలుచుచు సరసనుండ;
దివ్యము పునర్వసును మహాదీప్తిఁ గొలువ
వఱలువిధుఁ బోలు నీ రామభద్రుఁ డిచట. ౧౫

లక్ష్మః-ఆర్యా! కణ్వుఁ డిదే వచ్చినాఁడు.

రాముః-(నమస్కరించి) ఇదే యాసనము. కూర్చుండుఁడు.

కణ్వః-(కూర్చుండి) రామాయణశ్రవణకౌతుకము గలదేని కుశ లవు లెంతవఱకు వినిపించిరో తెలుపుము.

లక్ష్మః-"...లక్ష్మణుఁ డాక్షణంబ
జనకజాతను విడనాడి చనియెఁ బుఱికి." (ఇది పఠించి)
ఇంతవఱకుఁ గుశలవులగానము.

కణ్వః-తరువాత వినుఁడు.

రాముః-ఏమిగతియో?

కుశలవులుః-రామదారకు భద్రమే పాడుదు.

కణ్వః-

గీ. అంత వాల్మీకిమౌని శిష్యాళివలన
నామెవృత్తాంతముఁ విని యరసి యామె
నూఱడిలఁ బల్కి స్వయముగా నుత్సహింపఁ
జేసి కొనివచ్చె నిజతపోవాసమునకు. ౧౬

రాము:-భగవదనుగ్రహీతము రఘుకులము. భగవదభ్యర్థ్యు తుండ నైతిని.

కుశలవులు:-అదృష్టమున రామదారకుఁ గుశలము.

(అందఱు హర్షము నందుదురు.)

కుశ:-ఓవత్సా! లవా! వాల్మీక్యాశ్రమమున సీత యెవరు?

లవు:-ఎవరును లేరు. సీత సీత యనునక్షరములు కేవలగీతినిబంధనములు.

రాము:-తరువాత? తరువాత?

కణ్వు:-

గీ. నెలలు తొమ్మిదికూడను నిండినంత,
గగనలక్ష్మి సూర్యేందులఁ గన్నయట్లు
కాంచె నిరువురుపుత్త్రిలఁ గవల సీత
ముద్దులొలికెడివారి సమ్మోదముతోడ. ౧౭

లక్ష్మ:-ఆర్యా! జయము. అదృష్టమున రాఘవకులము వర్ధిల్లుఁగాక!

కుశలవులు:-పుత్త్రజన్ముఁడగు మహారాజునకు జయమగుఁగాక!

రాము:-(తనలో) ఈకుశలవులే వారేమో!

కణ్వు:-

గీ. జాతకర్మాదికము నెల్ల సలిపి మౌని
సక్రమంబుగ; వారికి సముచితముగఁ
గుశలవాఖ్యల నెంతయుఁ గుదురుపఱచె
నామకరణోత్సవపువేళ నామహర్షి. ౧౮

రాము:-ఓహో! వీరే సీతాతనయులు. హా! పుత్త్ర! కుశ! హా! పుత్త్ర! లవ!

లక్ష్మ:-ఈకవ దేవీసంభవ మగునార్యుని యాత్మసంక్రాంతి.

కుశలవులు:-ఎల్లెల్లా ! హా! తండ్రీ! రక్షింపుము.

(అందఱు నొండొరులఁ గౌఁగిలించుకొని మూర్ఛిల్లుదురు)

కణ్వ:-(విషాదముతో) ఏమి! కష్టము సంప్రాప్తించెనే!

గీ. మందభాగ్యుఁడనే నైతి మంగళప్ర
దంబుగాఁ గథ సాగించి తరలియున్న
వీరి నల్వుర రఘువంశవీరవరులఁ
బతనమందఁగఁ జేసితిఁ బాపినైతి. ౧౯

(చూచి) అదృష్టము. శ్వాస యున్నది. ఈవృత్తాంతము దేవికిని భగవానునకును నివేదించెను. (నిష్క్రమించును.)

(అంత వాల్మీకియు ససంభ్రమయై సీతయుఁ బ్రవేశింతురు.)

వాల్మీ:-వత్సా ! త్వరపడుము. విలంబము వలదు. అప్రతిక్రియమాణ మగువీరిమూర్ఛ మరణముగాఁ బరిణమించును.

సీత:-చెప్పుము. చెప్పుము పరమార్థము. రాఘవులు జీవించి యున్నారా?

వాల్మీ:-ఊఱడిల్లుము. రాఘవులు సజీవులే. వీరియుచ్ఛ్వాసములు కనవా ?

సీత:-తండ్రీ! నాకు దృఢప్రత్యయముఁ గలిగించితివి.

వాల్మీ-(అన్వేషించి)

గీ. ధైర్య మవలంబనముగ యత్నమ్ము వలసెఁ
గనులు దెఱచి కనుంగొను కాంత! నీవిఁ
ద్వత్కథావిలయపవనతాడిత మయి
కూలిపోయెను రాఘవకులము నేఁడు. ౨౦

సీత:-(లజ్జతో) భగవానుఁడా! ఆర్యపుత్రుఁడు నాకు దర్శనానుజ్ఞ యొసఁగలేదుకదా!

వాల్మీ:- (అవష్టంభముతో) నే నుండఁగా, నీకభ్యనుజ్ఞకుఁ గాని ప్రతిషేధమునకుఁ గాని కర్త యెవఁడు ? నడువుము. వాల్మీకి నగునేనే నీక భ్యనుజ్ఞ యొసఁగితిని. నిస్సంశయవై నీభర్తకు సేవచేయుము.

సీత:-ఇట్లేల జరగినదో! మందభాగ్యను. సర్వథా హతురాలను. (నేలఁబడి యేడ్చును.)

వాల్మీ:-లెమ్మా! కుశలవుల నూఱడింపుము. నేను రామలక్ష్మణుల సేద దేర్చెదను. వత్సా! రామా! వత్సా! లక్ష్మణా! ఊఱడిల్లుఁడు.

సీత:-జాతా! కుశా! జాతా! లవా! ఊఱడిల్లుఁ డూఱడిల్లుఁడు.

రాము:-(తెలివినొంది)ఆర్యా! కణ్వా! వైదేహి బ్రతికియున్నదా?

వాల్మీ:-నీ ముందే కలదు.

రాము:-(చూచి) ఓహో! భగవత్సంప్రాప్తి! (సిగ్గుపడును)

వాల్మీ:-సిగ్గుపడకు. కళత్రవిషయమునఁగదా నీయనుకంప.

లక్ష్మ:-(తెలివంది) ఆర్యునకుఁ దెలివి వచ్చినదా?

రాము:-మందభాగ్యుఁడను. ప్రత్యాగతుఁడను.

కుశలవులు:-(తెలివంది) హా! తండ్రీ! రక్షింపుము. (పాదములఁబడి రోదనము చేయుదురు.)

రామలక్ష్మణులు:-(కౌఁగిలించి యూఱడింతురు) వత్సలారా ! ఆవేగము వలదు.

వాల్మీ:-ఆ ! పితృదర్శనదుర్లలితులారా! ఏల రోదింతురు ? అశ్రువులు తుడువరేమి?

కుశలవులు:-(కన్నీరు దుడుచుకొని రాముని జూతురు.)

సీత:-(అపవారించి) మీ రిరువు రెవరిని జూచుచున్నారు?

రాము:-ఆహా! వైదేహియొక్కదాసీన్యము! నాసన్నిధానము చిరకాలమునకు సంప్రాప్తించినను ముఖవికాసముచే నైన నన్ను సంభావింపకున్నది.

వాల్మీ:-(కోపముతో) ఓరాజా! ధృతసౌహార్ద మహాకులీన! సమీక్ష్యకారీ! నీ కిది యేమియుక్తము? జనకునిచేఁ బ్రతిపాదితయై, దశరథునిచే గృహీతయై, యరుంధతిచేఁ గృతమంగళయై, వాల్మీకిచే విశుద్ధచారిత్రయై, విభావసునిచే భావితశుద్ధయై, కుశలవులకుఁ దల్లియై, విశ్వంభరాదేవికి దుహితయై వఱలు సీతాదేవిని జనాపవాద మాత్రశ్రవణముచే నిరాకరించితివి!

రాము:-(వైక్లబ్యము నందును.)

వాల్మీ:-సౌమిత్రీ! ఇది యుక్తమా? ఐనను నిన్ననవలసినపని లేదు. నీవు నియోజ్యుఁడవు. కనీయుఁడవు. (రాము నుద్దేశించి) దశగ్రీవవీరవధావసానమున సీతాపరిగ్రహమున కే దేవుఁడు నీకుఁ బ్రమాణమొసంగెను?

రాము:-వైశ్వానరభగవానుఁడు.

వాల్మీ:-ఐన, నీప్రత్యయనివృత్తి కేమికారణము?

సీత:-అయ్యో! ఛీ! అధన్య నగునన్నుఁగూర్చి యార్యపుత్త్రుఁ డధిక్షేపింపఁబడుచున్నాఁడు గదా! (చెవులు మూసికొనును.)

వాల్మీ:-

గీ. కుశలవులతల్లి పరిశుద్ధిఁ గోరినప్పు
డనిలసఖుఁడే నియుక్తుఁడై నపుడు నీకుఁ

గడునిరంకుశహృదయంబుఁ గాంచనగునె
ప్రాకృతజనాపవాదలవంబుకతన. ౨౧

రాము:-(వాల్మీకి నిందుక స్పృశించును.)

వాల్మీ:-ఏల! వీరహస్తమున నన్నేల త్రోయుదువు ?

మ. అనురాగం బది ప్రాకృతంపుజనమం
దత్యంతసంవర్ధకం
బును విస్ఫారితమున్ సుఖప్రదమునై
పొందించు నానంద; మా
యనురాగంబె నరేంద్రకర్కశహృదిన్
వ్యర్థంపుమాల్యం బగున్;
గననౌనే పులినంబునందుఁ దిలలున్
సస్యంబులై పండుటల్ ? ౨౨

వత్సా! ఈఘుర్షణ మేల? కుశలవులను గైకొనుము. మే మా
శ్రమపదమునకుఁ బోవుదుము.

రామలక్ష్మణులు:-భగవానుఁడా! ప్రసన్నులై దయచేయుఁడు.

వాల్మీ:-(వెనుకకు మరలి) వైదేహీ! తపోవనగతులకుఁగూడ దండ
మాజ్ఞాపించుచున్నాఁడితఁడు. నీవు నిన్నుఁ బరిశోధించు
కొనుము.

సీత:-నే నేమి పరిశోధించుకొందును?

వాల్మీ:-పాపినివి కానట్లు.

సీత:-(లజ్జితయై) జనమధ్యమునకేఁగి యిట్లుపలుకుచును:-"మంద
భాగిని యగు విదేహరాజసుత యభిన్నచారిత్ర:-"

వాల్మీ:-వికారానుగూపము ప్రతికారమని యుద్ఘోషింపుము.

సీత:-గురునియోగము ప్రాభవము. (అంజలిపట్టి దిశలు పరికించి)

ఓలోకపాలురారా! గగనమధ్యచారు లగుదేవతాగంధర్వ సిద్ధవిద్యాధరులారా! ప్రభావప్రత్యక్షీకృతసర్వలోకరహస్యు లగు వాల్మీకివిశ్వామిత్రవసిష్ఠప్రముఖులారా! సకలలోక శుభాశుభకర్మసాక్షీ! రాఘవకులపితామహా సహస్రకర భగవానుఁడా! చారిత్రశుద్ధి కన్యము విడిచి సీత సత్య ప్రమాణము చేయుచున్న దాలకింపుఁడు.

వాల్మీ:-మహాప్రభావాకృష్టము సీతామాహాత్మ్య సంభృతాశ్చ ర్యము మీరెల్ల రాలకింపుఁడు.

అందఱు:-(విస్మయముతో) ఆశ్చర్య మాశ్చర్యము! ఇదే దేవి వచనానంతరము దత్తావధానమై నిశ్శబ్ద ప్రశాంత మఁతో నివృత్తసర్వారంభమై సమస్తస్థావర జంగమ లోకము నున్నది. మఱియు:

గీ. అలలు లేవమి శాంతంబు లయ్యె నుదధు;
లనిలహతి లేమి శాంతాత్మ యయ్యె నభము
దిగ్గజంబులు వినఁ జెవు లొగ్గి సీత
పలుకువాక్యముల్; విను జగంబులును శ్రద్ధ. ౨౩

సీత:-సకలలోకమహార్ధప్రత్యయాపూరితగురుశాసను, నున్మూలిత మహామహీధరసహస్ర విరచితసేతుబంధ విభక్త మహా సముద్రుని, సురాసురభువనైక ధనుర్ధరుని, రాఘవకుల నందనుని శ్రీరామునిదక్క నన్యునిఁ బతివ్రతావిరుద్ధభావ మునఁ గంటనైనఁ జూచికాని, నోటనైనఁ బలికికాని, హృదయమందైనఁ దలఁచికాని యెఱుఁగనేని, నాసత్య వచనమున నిఖిలలోక ప్రత్యక్షదృశ్యమాన దివ్యరూప

ధారిణిపై మహాప్రభావ, భగవతి, ధారిణీమాత నాచిత్త
శుద్ధిని లోకమునకుఁ బ్రకటించుఁగాక!

(అందఱు సంభ్రమ మందుదురు)

వాల్మీ:-ఏమి! అవ్యక్తభీషణ మయి లోకమునకు రసాంతరము పుట్టిన దే!

శా. పాతాళప్రభవంబునై భువిదివిన్
వ్యాపించె నిర్ఘోష! మా
పాతక్లిష్టతవోలె మందముగ వ్యా
ప్తంబయ్యె నల్దిక్కులన్
భీతిన్ బర్వతఘోషమున్; జలనిధుల్
బీభత్సరూపంబునన్
జాతప్రీతి నతిక్రమించి తడిపెన్
సామీప్య కాంతారముల్. ౨౮

సీతా! ని న్నుద్దేశించి సర్వలక్షణము లుద్భవించుచున్నవి. నీవు పలికినసత్యప్రమాణమును మరలఁ బలుకుము.

సీత:-("సకలలోకమహార్థప్రత్యయాపూరితగురుశాస" నేత్యాదిని మరలఁ బలికించును.)

(తెరలో)

గోవులకు శుభమగుఁగాక! బ్రాహ్మణులకు శుభమగుఁగాక! రాఘవకులమునకు శుభమగుఁగాక!

ఉ. శ్రీమిథిలాధిరాజసుత
సీతవచస్సుల నాలకించి ధా
త్రీమహిళావతంసము ధ
రించినసంభ్రమపుఁగాంచితోడ, ది

వ్యానులయోగరూపమున
నద్భుతమా నవతార మెత్తి నేఁ
డీమనభూమిపై దిగియె
నెంచి కనుంగొని మ్రొక్కుఁడీ ప్రజల్! ౨౭

(అందఱు విని విస్మయ మందుదురు)

వాల్మీ:-ఏమీ!యాశ్చర్యపరంపరావృత్తి! అదృష్టశ్రుతపూర్వము గదా!

మ. అదె పాతాళమునుండి పుట్టినది ది
వ్యజ్యోతి వర్ధిష్ణువై;
యదె పాతాళసరోవరోదితము ప
ద్మామోదాప్తగంధానిలం;
బిదె విచ్చేసె ధరిత్రి వందనము లం
దీయరే వరేఁ రామ! స
న్నిధి మ్రొక్కరే వలె లక్ష్మణా! కుశలవుల్!
నింపుండు పుష్పాంజలుల్. ౨౮

(అందఱు నాప్రకార మొనర్తురు)

(అంత, సమానోదాత్తోజ్జ్వలవేషలై పుష్పములు చల్లు స్త్రీలతోఁ బాతాళోద్భేదనమున భూదేవి ప్రవేశించును.)

అందఱు:-(అంజలులు ఘటించి) తల్లీ! భూదేవీ!

క. సకలజగద్భారము నీ
వకదా! వహియింతు శేషవహనముఁ గని మఱి
సకలవరంబు లొసంగితి
వికదా! గోరూప వగుచు వేల్పులు పిదుకన్. ౨౯

క. కైలాసము వింధ్యంబును
నీలీలామూర్తి కగు గణింపఁ గుచంబుల్

మాలాత్మక మాజాహ్నవి
మే లవుమణిమేఖలయొ చుమీ సాగరమున్. ౨౮

క. యజ్ఞాంగోత్పత్తికినై
విజ్ఞుఁడు సురరాజు నీకు వృష్టిఁ గురించున్
సుజ్ఞేయ వైనమాతవు
విజ్ఞాంబా! సకలరత్నవివిధౌషధులన్. ౨౯

భగవతీ! విశ్వంభరా! నమోనమః. (నమస్కరింతురు.)

భూదే:-(దిశలు పరికించి) ఆహా! ప్రతినివృత్త లగుపతివ్రతల శాసన మనతిక్రమణీయముకదా! నాలోకము:

గీ. భూనభోంతరవ్యాప్తముల్ భానురశ్మ
లరయనేలేవు, తార్క్ష్యుండుఁ జొరఁగలేఁడు;
అల్పతాపసయోగుల కగును దవ్వు;
అచటనుండి వచ్చితి జనకాత్మజకయి. ౩౦

కావున నామెను బలుకరించెదను. వత్సా! మైథిలీ! నీవేమి వేఁడుదువు?

సీత:-(విస్మయముతో విలోకించి) భగవతీ! నీ వెవతెవు?

భూదే:-భగవతీ! నీవు నన్నెఱుఁగనే యెఱుఁగవా?

గీ. వరమునులు నన్ను రెండవప్రణవ మందు;
రీచరాచరముల కెల్ల నేనె మాత;
నఖిలతపములు నావల్ల నగును సిద్ధి;
పావనీ! సీత! నేను భూదేవి నమ్మ! ౩౧

బిడ్డా! నీ విదియుఁ దెలిసికొనుము:

గీ. పూర్వము మహావరాహంబుమూలముసను
రమణి ! కలిగె మహాభ్యుద్ధరణము నాకు
నేఁడు కలిగెను మరలఁ ద్వన్నిరుపమాన
సత్ప్రభావంబుకతమున జనకతనయ ! 3౨

సీత:-(అంజలి ఘటించి) భగవతీ ! అనుకంపముతో నీవు లోకమున నాచారిత్రావికలత్వమున నన్నెట్లు చూచితివో ప్రకటింపుము.

భూదే:-తథాస్తు. (అంతటఁ జూచి)

గీ. మానులార ! దానవులార ! మహితసిద్ధ
సాధ్యచారణగంధర్వజాతులార !
యక్షులార ! మానవులార ! అఖిలదిక్ప
తిప్రముఖులార ! వినుఁ డీప్రతిజ్ఞ శ్రద్ధ. 33

గీ. దాశరథి యైనరామునిదక్క నన్య
నెడఁద నెన్నఁడుఁ దలపోసి యెఱుఁగ దీప
తివ్రతామణి సీత; సాధ్వియె యటంచు
సదయులార! మీ కెప్పుడు విదితమెకద! 3౪

(ఆకాశమునఁ బుష్పవృష్టి, దుందుభిధ్వనులును.)

అందఱు:-(హర్షులై) ఆహా ! విస్మయము ! వసుంధరాసంపాదిత శుద్ధి ననుసరించి వివిధమంగళనిస్వనములు వెలువడుచున్నవి :

గీ. దశదిశలదివ్యదుందుభిధ్వనులు మ్రోసె;
నేకధారగా సుమవృష్టి యెసఁగె మింట;
గగనమందున నెవరో యాకస్మికముగ
దేవిపై మేల్వితానముల్ దీర్చి రహహా! 3౫

(తెరలో)

గీ. జయము జయమహాత ! దశరథా ! సత్యసంధ !
జయము జయము రామా ! ఏకచాపహస్త !
జయము రఘువంశకల్పవృక్షమున కెపుడు
జయము చారిత్రశీలకు జనకసుతకు. 31

భూం దే:-వైదేహి శుద్ధిమతి యైనట్లేనా ?

అందఱు:-(అంజలిబద్ధులై )

గీ. ప్రకృతిచేతనె పరిశుద్ధభావ యయ్యుఁ
గప్పఁబడె నపవాదమేఘంబువలన
నీకృపాశరల్లక్ష్మియు నెగడఁ జంద్ర
కాంతివలె నొప్పుగాంచె నీయింతి నేఁడు. 32

(ప్రణమిల్లుదురు.) ఇదే యాశ్చర్యము ! మిథునము మరలఁ గలిసికొన్నది.

వాల్మీ:-ఓయీ ! కౌసల్యాపుత్త్రా! పరిశుద్ధపరిగ్రహణమున సీత సంభావిత యాఁగాక !

రాము:-గురువు లాజ్ఞాపించినట్లే యొనర్తును. వత్సా ! లక్ష్మణా! పాదప్రణామ మాచరింపుము.

సీత:-(అంజలిపట్టి హర్షముతో) ఆర్యపుత్త్రునకు జయము !

వాల్మీ:-ఈప్రతిగ్రహపద్ధతి యుదాత్తశాలీనముగదా !

లక్ష్మ:-(హర్షముతోను లజ్జతోను) ఆర్యారాలా ! వధ్యుఁడు పాపి లక్ష్మణుఁడు ప్రణమిల్లుచున్నాఁడు.

సీత:-వత్సా! ఏల నిన్ను నిందించుకొందువు ? ఆత్మగురునియోగ వర్తివై చిరకాల ముండుము.

వాల్మీ:-వత్సా ! రామా ! దీనివలన సీత గ్రహింపఁబడినది.

ఇఁక నీవు భాషించి పాణిగ్రహణమున యజ్ఞకార్యమున నియోగింపుము.

రాము:-(సిగ్గుపడును.)

వాల్మీ:-సిగ్గు వలదు. యజ్ఞాంగములు లేక సర్వసాక్షిక మగు పాణిగ్రహణ మపూర్వ మనియా ?

రాము:-ఇది యాచారము. గురునియోగము. (సీతచేయి పట్టుకొని) కల్యాణీ ! వైదేహీ !

గీ. ధర్మపత్నీపరిగ్రహాధన్యున కిల
నిష్టము నపత్యము ఫలంబు లెండు ననిరి
బుధు; లపత్యంబు నీయందుఁ బొందుపొసఁగె
నిష్టమును బొందు మిలు సేరి యింకమీఁద. 30

సీత:-ఆర్యపుత్త్రనియాజ్ఞప్తిఁ దలఁదాల్తును. నా కిపుడే యూపిరాడుచున్నది. పోయినప్రాణములు తిరిగివచ్చి బొందిని జేరినవి.

భూదే:-

శా. సీతారామసమాగమంబు గలిగెన్
సిద్ధించు యజ్ఞంబు లే
యాతంకంబును లేక, యింద్రుఁడును వ
ర్షావాప్తిఁ గల్గించి వి
ఖ్యాతిం గాంచునుగాత మెల్లయపుడున్
గారుణ్యసంపూర్ణమై
యాతంకంబులు లేని సుప్రజయె రా
జ్యంబందు వెల్గొందుతన్! 31

(అంతర్ధాన మగుచు నిష్క్రమించును.)

రాము:-ఏమి ! భూదేవి యంతర్ధాన మైనదే !

వాల్మీ:-దేవత లనతిదీర్ఘసన్నిధానలు.

రాము:-భగవానుఁడా ! నేనును ద్వదనుజ్ఞాతుఁడను. లక్ష్మణు నభిషేకింపఁగోరుదును.

లక్ష్మ:-(అంజలి పట్టి) ఆర్యుఁడు ప్రసన్నుఁ డయ్యేనేని, తనయ సంక్రామి యైనయువరాజశబ్దము చిరకాలానుచరుఁ డైన సౌమిత్రినుండి తొలఁగుఁగాక!

వాల్మీ:-ఇది యిక్ష్వాకుకులాభిహితము.

రాము:-ఏమిగతి ? రామునకు లక్ష్మణప్రార్థన మనతిక్రమణీయము. ఈకర్మ వత్సకవశ్య మేని నే నది యాచరించెదను. సౌమిత్రీ! అభిషేకసంభారములఁ గొని తెమ్ము.

లక్ష్మ:-ఆర్యా! వ్యగ్రహస్తు లయి యభిషేకసర్వోచితము దేవతలే సిద్ధపఱచిరి. ఇదిగో!

గీ. చంద్రగౌరాతపత్రము నింద్రుఁడు గొనెఁ;
జామరములు వీతురు శచీజాహ్నవులును;
జనులు పూనిరి జలపూర్ణకనకకలశ
లహహ! ప్రణయసులభము లిత్యాదు లెల్ల. ౭౦

రాము:-ఐన, మనకు వేత్రాధికారము.

లక్ష్మ:-ఈయధికారసంవిభాగము నా కనుగృహీతాభియోగము.

రాము:-లక్ష్మణా ! వేత్రహస్తుఁడవు కమ్ము. (వాల్మీకి నుద్దేశించి) భగవానుఁడా ! మనుమని నభిషేకింపుము.

వాల్మీ:-(కలశముఁ గైకొని సమీపించి)ఓ సాకేతపురవాసు లగుపౌరులారా ! నానాదిగంతవాసు లగురాజులారా ! విభీషణ

సుగ్రీవహనుమత్ప్రభృతు లగుమహారథులారా! మీ
రెల్లరు వినుఁడు :

గీ. మైథిలీపుత్త్రరత్నము మహితుఁ డైన
కుశమహారథుఁడు నభిషిక్తుం డను నయ్యో
నఖిలసామ్రాజ్యమున కింక నధిపుఁ డతఁడె
యతనిశాసనమే మాన్యమగాత! మీకు. ౪౧

గీ. స్వర్గలోకమునందు వాసవునికీర్తి
నాగజగమున వాసుకినాఁగ వెలసి
భువిని మాంధాతృభూపాలుఁ బోలి నీవు
మంగళంబును గాంచు మోమహీప కుశుఁడ! ౪౨

(తెరలో)

(కలకలము.) జయజయ మహారాజ!

సీత:-నాభాగ్యమునఁ బ్రియము ఘటిల్లినది.

రాము:-లక్ష్మణునిమనోరథములు సఫలము లైనవి.

అందఱు:-(హర్షింతురు.)

రాము:-(కుశు నుద్దేశించి) రాజా! నీయనుజ్ఞ గాంచి యౌవరాజ్య
మున లవు నభిషేకింపఁ గోరుచున్నాను.

కుశ:-తండ్రీ! దేవా! నీచిత్తము.

రాము:-మంచిది. (కలశము గొని)

గీ. కుశమహారాజుతమ్మునకును లవునకు
యౌవరాజ్యాభిషేకము సాదరమునఁ
గుశమహారాజునాజ్ఞ నాకుఁగా బొసర్పఁ
గాన నభిషిక్తుఁ జేయుదు నేను బ్రీతి. (అభిషేకించును.) ౪౩

అందఱు:-(యథోచితముగా హర్షము నందుదురు.)

వాల్మీ:-నీ కింక నేమిప్రియ మొనగూర్తును?

రాము:-

మ. భవదీయం బగుదైవికాగమనసం
ప్రాప్తిఁ లభించెఁ విశు
ద్ధవిధానంబున ధర్మపత్ని క్రతుస
ద్ధర్మక్రియార్హంబుగా;
భువనాధీశ్వరతఁ బ్రతిష్ఠు లయి పౌ
ల్పుంగాంచి రీపుత్త్రి; లిం
కివి గా కన్యము లైన కామ్యములు నా
కేవీ మిమ్ముఁ వేఁడఁగఁ. ౮౮

వాల్మీ:-ఐన ని ట్లగుఁగాక!

చ. హరిహరపద్మగర్భముక
రాలయపావకమాతరిశ్వ లా
యురగనరామరత్రయము
హోన్నతలోకములుఁ స్వరంబులుఁ
గురుచతురాగమంబులు న
కుంఠిత సద్వ్రితముల్ యతీశులుఁ
వరము లొసంగఁ బుత్త్రిలకు
వర్ధిలుఁ గావుత! గోకులంబులున్.

(అందఱు నిష్క్రమింతురు.)

## కుందమాల

షష్ఠాంకము సర్వము సంపూర్ణము.

శ్రీ శ్రీ శ్రీ

# ల ఘు టీ క

పుట 1. కుందమాల. కుంద మనఁగా మొల్లపూవు. ఆపువ్వులతోఁ గ్రుచ్చి నదండయే కుందమాల. 'మాఘ్యం కుందమ్' అని అమరము. మాఘమాసమునఁ బుట్టుటచే మాఘ్య మనియు 'కుం భువం ద్యతి ఉద్భవకాలే కుందం దో అవఖండనే' పుట్టునప్పుడు భూమిని వ్రక్కలించున దగుటచే 'కుంద' మనియు వ్యుత్పత్తి. కుందపుష్పము జాజికంటె నెన్నోరెట్లు సువాసనకలది. మల్లెకంటెఁ జాలఁ దెల్లనిది. మాలతికంటె నెక్కుడు మనోహర మైనది.

ప్రథమాంకాంతమున (౨౨ పుట. ౧౩, ౧౮ పం.) సీత "భగవతీ! భాగీరథీ! నీదయచే నేను సుఖప్రసవనైతినా దినదినము నీకొకకుందమాలోపహార మొసంగుదును" అని యనియుండుటచేతను; తృతీయాంకమున (౩౫ పుట ౩౧, ౧౮ పం) కుందమాలయే రామలక్ష్మణులకు సీతను గనుఁగొనుటకు హేతుభూత మగుటచేతను దిఙ్నాగుఁ డీనామమునే యీనాటకమున కుంచెను. ఇట్లు కథామధ్యమున సంభవించినవస్తువుపేరు నాటకమున కుంచుట "అభేదోపచారపద్ధతి" యందురు.

నాంది యనఁగా దేవతాదిప్రీతికొఱకై పూర్వరంగప్రధానాంగముగ మంగళార్థముచేయు స్తుతి. ఇందలి తొలిపద్యమున 'లంబోదరస్తుతి' యాశీర్వచనసంయుక్తమును 'మందారమాలికా' పదము మాంగల్యభాజకమునైనది.

విఘ్నేశ్వరునకు నమస్కారముచేయుటకై యింద్రుఁడు తనకిరీటముతో నాతనిపాదములు సోఁక సాఁగిలపడినప్పుడు జంభారికిరీటమున శోభిల్లు మందారమాలయందలి మధువును జుంబించు నాతనిపాదధూళి యంతరాయపరంపర యను సముద్రమును శోషింపఁజేయుఁగాక యని భావము.

సూత్రధారుఁడు వస్తుబీజమును గాని పాత్రముఖమును గాని సూచించును. రంగమున ప్రసాదమధుర మగుశ్లోకముచేఁ గావ్యార్థసూచనను జేయును. ఆతరువాత నాటకకర్తనామము, గోత్రాదికమును స్తుతించును. ఏదేనొక ఋతువును భారతీవృత్తి నాశ్రయించి తాను గీర్తించును; లేక నటిచేఁ

గీర్తింపఁజేయును. పూర్వరంగప్రధానాంగ మగునాంది నీతండు జేసి పిమ్మట "పరిపక్వోర్ధ్వ" పద్యముచే సభాపూజన మొనరించుచున్నాఁడు.

పరిపక్వ=మిక్కిలి వృద్ధిపొందిన, ఊర్ధ్వ=పైకి, విసర్పణ=బయలువెడలిన, ఆంతర=మనసునకు సంబంధించిన, తపః=తపస్సు అను, వహ్ని=అగ్ని యొక్క, ఉజ్జ్వల=మిక్కిలి జ్వలించుచున్న, జ్వాలయో=మంటయో, వర=ఉత్తమమైన, గంగ=గంగానదినుండి, ఉద్భవ=పుట్టిన, వీచికా=అలలనెడి ఫణి=పాములకు స్థానమైన, లసత్=చక్కని, వల్మీకమో=పుట్టయో. స్నిగ్ధ=కోమలత్వముచేత, సుందర=అందమైన, శీతాంశుని=చంద్రుని యొక్క, నిత్య=శాశ్వతమైన, సంధ్యయొ=సంధ్యాకాలమో, అనఙ్=అనునట్లు, బాల=అప్పుడే ఉదయించిన, అరుణ=రక్తవర్ణముగల, అర్క=సూర్యునియొక్క, ద్యుతి=కాంతియొక్క.

2. స్ఫురణశ్రీన్=స్ఫూర్తిసంపదతో, పరిణతి నంది పైకెగయు శివుని యాంతరతపోగ్నిజ్వాలయో, గంగానదీతరంగము లనుసర్పములకు స్థానభూతమైనపుట్టయో, సుందరుఁ డగుచంద్రునికోమలసంధ్యాకాంతియో, యనునట్లు బాలసూర్యకాంతితో నొప్పుశివజటాజూటము మిమ్ము రక్షించుఁగాక!

శివునితలపై గంగ యున్నది. అందలితరంగములు పాములవలె నున్నవి. ఆపాములకు శివునిజటాజూటము పుట్టవలె నున్నది. గంగాతో యమున సర్పము లుండుటయు, శివుఁడు భుజగభూషణుఁ డగుటయు సుప్రసిద్ధములే. చంద్రప్రదోషము బాలారుణార్కద్యుతి జటాజూటము లేఁత తామ్రపిశంగవర్ణములు కలిగియుండుట ప్రసిద్ధము.

వహ్నిజ్వాల యన్నప్పుడు సీతాగ్నిశుద్ధి సూచితము. గంగా, వల్మీక శబ్దములచే గంగానది, వాల్మీకిమహర్షి, 'బాలారుణార్క' యన్నప్పుడు బాలవీరు లగు కుశలవులు నిందు సూచింపఁబడిరి.

ప్రయోగ=అభినయమునకు, సాచివ్య=సహకారమును, విధాయిని=చేయునది. ఆర్యా=ఇట నటియని యర్థము. "చేయవలసినది చేయుచు, చేయరానిది చేయక ప్రాచీనాచారముల నిర్వర్తించువా రార్యులు. వీరు కులశీల దయాదానధర్మసత్యకృతజ్ఞతాఽద్రోహము లనుగుణములు కలవారు."

ఈడ్చుకొనిపోవంజొచ్చె-'పరికర్షతి' అని మూలము. త్వరగాఁ దీసికొనిపోవు అని భావము.

స్థాపన. ప్రస్తావన, ఆముఖము రెండును పర్యాయపదములు. నటీవిదూషక పారిపార్శ్వకులలో నొకరితో సూత్రధారుఁడు చిత్రవాక్య సల్లాపము కావించుచు స్వకార్యమును ప్రస్తుతాక్షేపద్వారమున నిర్వర్తించుకొనుటే ప్రస్తావన. కాని, సూత్రధారుఁడు సహచరులు లేక యొక్కఁడే పై కార్యమును నిర్వర్తించుటే స్థాపన. ఇది ఉద్ఘాత్యకము, కథోద్ఘాతము, ప్రయోగాతిశయము, ప్రవర్తకము, అవలగితము నని నైదువిధములు.

ఇందలి స్థాపన ప్రయోగాతిశయము.

3. ప్రతానములు=కొమ్మలయం దుండునాకులగుంపులు వానితోఁ గూడినద్రాక్షాతాంబూలవల్ల్యాదులు. గాంధర్వప్రియములు=(హేతుగర్భ విశేషణము) గానరాగాదిక మన్న నిష్టముకలవి.

అమంద్ర నాదములు=గంభీరము కానిధ్వనులు. ('మంద్రస్తుగంభీరే అని అమరము.) కలహంసముల యమంద్ర నాదములే మిగుల మనోహరములని భావము.

4. అనాలక్షిత=న + ఆలక్షిత=చూడఁబడని. స్యందనము=రథము. ప్రపాతము=నిమ్నభూభాగము. సముత్పన్న=పుట్టిన, విమర్శులు=శంక గలవారు.

ప్రలాపించు=అనర్థక మైనమాటలు పలుకు.

గర్భిణీభావసులభము=గర్భము ధరించుటచే స్వభావసిద్ధము. దోహదము=కోరిక.

భాగీరథి=గంగానది. భగీరథుఁడు తపముచేసి తీసికొనివచ్చుటచే భాగీరథి యనునామము గంగ తాల్చినది.

5. భగవతి=భగ + వతి=పావనోదక మను నైశ్వర్యము కలది. గంగానది. ఐశ్వర్యసమగ్రత, వీర్యము, యశము, శ్రియము, జ్ఞానము, వైరాగ్యము అని యైశ్వర్యము లాఱు. ఈయాఱింటిలో నొకటికాని యాఱును గాని కలది భగవతి.

6. దురవతారములు=దిగుటకు వీలు కానివి; దిగుటచే దుఃఖము కలిగించునవి. నీవారలత=తృణధాన్యపుతీఁగ.

7. నిర్లక్షణుఁడు=సల్లక్షణరహితుఁడు, కులక్షణములు కలవాఁడు.

8. స్వగృహము, మిత్రజనము, యాగనిచయానుష్ఠానము, రమ్య భవనవాసము—ఎన్ని యున్నను సీత లేనియిల్లు రామునకు వనసదృశమే.

9. బోధ్యమాన=ఒకరు తెలిసినది. ఉపాలంభనము=నిందతోడి మాట. 12. ౧౫ ప. తాత్పర్యము. పరమపతివ్రతాశిరోమణి యగుసీతను విడుచుటలోఁ గలరామునిభావము లక్ష్మణునకు నగ్రాహ్యమే. స్వీకరణనిరాకరణసమర్థుఁ డగురాముఁ డింటినుండియే కాదు దేశమునుండియుఁ దొలఁగించినవాఁడు హృదయమునుండియుఁ దొలఁగించియుండవచ్చునని యాతఁడు తలంచెను. దంపతులకు సాధారణముగాఁ బ్రణయశైథిల్యము సంభవించినపుడు భర్త భార్యను శయ్యాసనాదులనుండియు నెక్కువదోష మున్నచో గృహమునుండి వేఱొకగృహమునకుఁ దొలంచునే కాని యింతదారుణమున కొడిగట్టఁడు. ఇట్టి బలాత్కారసీతానిర్వాసౌచిత్యము లక్ష్మణునకుసైతము పొడకట్టలే దని భావము.

13. సీమంత=పాపటయందు, నిహిత=ఉంచఁబడిన, అంజలి=అంజలికలది. క్షతము=పుండు. క్షారము=ఉప్పు. దట్టించు=నూరు.

15. శ్వాపదములు=వన్యమృగములు; బెబ్బులులు.

అప్రతిహతము=వ్యర్థము కానిది.

17. సతీవతంసము=సాధ్వీరత్నము, సీత. శ్రమము౯=అలసటను, కన్న౯=పొందినచో, వంశమున్=వంశజులకు, బంధువులకు, పాసినది=దూరమైనది. ఉజ్ఝిత=విడిచిపెట్టఁబడినది. సందిగ్ధస్థితి=ప్రమాదస్థితి.

18. విలక్షణచిత్తుల్=అన్యమనస్కులు, దుష్టచిత్తులు. విప్ర=విప్రుల యొక్క, ఆవాస=గృహాంగణముల, సేవా=సేవచేయుటయను, మహాః గుణులు=గొప్పసుగుణముగలవి.

19. నాయందున్=నాతో, వినిపింపన్=చెప్పఁగా.

20. పూర్ణచంద్రునుండియే యశనిపాతము=పూర్ణచంద్రుఁడు చల్లని వెన్నెలలఁ జిమ్మును గాని వజ్రముల వర్షింపఁడు. కాని, యిట విరుద్ధమైన దని భావము.

21. విదేహ=విగతదేహ=నిరస్తదేహాభిమానము.

22. స్థాణువు=శాఖాపత్త్రరహిత మగుచెట్టు.

23. సీమంతము=పూలుముడుచుట యను గర్భిణీసంస్కారవిశేషము. పుంసవనము=గర్భచిహ్నములు కలిగినతోడనే మగబిడ్డ కలుగవలయు నని చేసెడియొకానొక సంస్కారము, స్త్రీ గర్భము ధరించిన మూఁడవమాసమునఁ గాని నాలవమాసమునఁ గాని దంపతు లిరువురుఁ గూర్చుండి యీ కర్మ చేయించుకొందురు.

24. రామశ్యామలులు=రామునివలె సుందరులు. శ్యామలవర్ణ మనఁగా నలుపురంగు. కాని, కేవలము నలుపురంగు సుందరము కాదు. భారతరామాయణనైషధాదులందు ద్రౌపది సీత దమయంతులసౌందర్య వర్ణనము చేయుపట్లఁ జాలచోటుల శ్యామశబ్దము వాడఁబడినది, అచట శ్యామయనఁగా : శ్లో. "శీతే సుఖోష్ణసర్వాంగీ గ్రీష్మే యాసుఖశీతలా, తప్తకాంచనవర్ణాభా సా స్త్రీ శ్యామేతి కథ్యతే." అని వ్యాఖ్యాతలు వ్రాసి యున్నారు. అనఁగా శీతకాలమున సుఖోష్ణములు వేసవికాలమున సుఖశీతలములు నగు అంగములు కలిగి పుటము పెట్టినబంగారు రంగు కలిగిన స్త్రీ శ్యామ యని చెప్పఁబడు నని తాత్పర్యము. ప్రవేశకము : రంగమునఁ బ్రదర్శింపరానికథాభాగమును సంక్షేపముగా నీచపాత్రలచే రెండంకములమధ్యమునఁ జెప్పించుటే ప్రవేశకము. జరిగినవిషయము జరుగుచున్నవిషయము చెప్పుచు నిది జరుగఁబోవువిషయమును సైతము సూచించును. సీతకుఁ గవలుపుట్టుట, వారప్పుడే పెరిగి యోధు లగుచుండుట, సీత దుఃఖార్తయై యుండుట యనుభూతవర్తమానభవిష్యద్విషయము లిందుఁ జెప్పఁబడినవి.

26. ప్రకృతి=స్వభావముచేత, నిష్ఠుర=కఠినమైన, భావములు= అభిప్రాయములు.

27. నిదాఘము = వేసవి, పరిక్షామ = కృశించిన.

28. సపత్నీజన = సవతుల యొక్క, నిశ్వాస = నిట్టూర్పులచే, అనుపవిద్ధము = కలుషితము కానిది. అతిచిరంతన = అతిచిర కాలమునుండి, సంభావనీయత = ఆదరము నందుట.

29. ఈషత్ = కొంచెము, సముద్భిన్న = పుట్టిన, దశన = పండ్లయొక్క అంకుర = మొలక లుఁగల, వదనములతో = ముఖములతో. మహా, అర్ఘము = మిక్కిలి యమూల్యమైన, నృశంసత్వము = నిష్ఠురత్వము.

30. నిమంత్రణము = పిలుపు, ఉటజము = పర్ణశాల, ప్రస్థానము = ప్రయాణము.

31. నైమిశము = ఒక కానోక యరణ్యము. ఇందలి ఋషీశ్వరులు తమ తపోబలముచే నిమిషమాత్రములో దానవబలమును నాశనమొనరించిరఁట. నాఁటినుండి యది నైమిశము లేక నైమిషము అను పేరఁ బరఁగినది.

33. గంగాతీరమున వాల్మీకియాశ్రమ మున్నట్లు ప్రథమాంకమున విదితము. గంగాసమీపమున గోమతీనది ప్రవహించును. గోమతి కుత్తరతీరమున వాల్మీకియాశ్రమము కలదు. ఆతని దర్శించుటకై రాముఁ డయోధ్య నుండి బయలుదేఱినాఁడు. నైమిశారణ్యముకూడ గోమతి కుత్తరతీరముననే యున్నది. దానినుండియే వాల్మీకియాశ్రమము చేరవచ్చును.

శోక = దుఃఖముయొక్క, ఆవేగ = తీవ్రతచే, సమాక్షిప్త = కలఁగిన, హృదయుఁడు, మైకము = మోహము, ఆశాస్యము = కోరిక.

34. వ్యాళ = క్రూరమృగములచే, భయాకులము = భయముగొలుపునది, విప్రవాసము = దూరమున నుండుట, మరణము. వైశసనము = చావు. ఉపకంఠము = సమీపమునఁగలది. గారుడము = గరుడపచ్చ, హారిన్మధు = హరితవర్ణముగలనీటితో, పూరము = నిండినది, గరుడపచ్చలకు, హారిన్మణులకు, మధుజలమునకు నిధి స్థానమైనది.

పటీరము = చందనము, లలిత = సుకుమారమైన, నవ = క్రొత్త, ఇందు— చంద్రునియొక్క, పాదములు = కిరణములు, కాఁకలు = బాధకలిగించునవి;

వేఁడెక్కినవి. మరుత్తులు = గాలులు, కెలన = సమీపమున, వరాకి = దుఃఖశీల, ప్రోషిత = దూరదేశమున నున్నది, కేవుట = ఉండుట.

35. సైకతము = ఇసుకతిన్నె, అవిరళ = సాంద్రమైన, పదన్యాస = అడుగులచే, లాంఛితములు = గుఱ్తులుకలవి. వృంతమాత్ర = తొడిమలు మాత్రమే. అవశేషములై = మిగిలినవై, సంసూచ్యమాన = సూచింపఁబడుచున్న, కుసుమాపచయములై = పూలుకోయుటలుకలవై. లూన = త్రుంపఁబడిన, కిసలయములు = చిగుళ్లు కలవి. వనస్పతి = పుష్పములు లేక ఫలవంతమైనచెట్టు, ప్రత్యాసన్నవస్తులు = సమీపమున నున్నవి. తట = తీరమున, స్థ = ఉన్న, విరళ సైకతము = పలుచని పొరలుగలయిసుకతిన్నె, బలిదాన = పూజోపహారములచే, సమృద్ధము = నిండినది, ప్రతిస్రోతోపగతప్రదేశము = నదీప్రదేశము కలచోటంతటను.

36. ఈదృశ = ఇట్టి, అవస్థానము = ఉనికి, దుర్విదగ్ధుఁడు = అవివేకి. ప్రజాపతి = బ్రహ్మ, కంటకిత = బాధకలిగించు, శర్కరా = (ఇసుక, మొరప) నేలయందలి, శుక్తి = నత్తగుల్లలు ముత్తెపుఁజిప్పలు మున్నగువాని, పుట = దొప్పలవలని, దుఃఖ = దుఃఖముయొక్క, సంచారము = ఉనికి కలది.

37. శుష్కలు = ముండ్లు, శరారు = క్రూరమృగముల. భీరువులు = భార్యలు. ఆఁడుమృగము లని భావము. చక్కి = వైపు, ఆక్రామకములు = ఆక్రమించినవైన, హోమధూమపులేఖలు, లలిత = మనోహరముగ, నిభృత = ఉంచఁబడిన, విన్యాసము = ఉనికి.

38. ప్రబాధము = అత్యధికమైనది. విలాస మనఁగా "ప్రియసమీపగమనమున స్థానాసనగమనములను గనుఁగొనుచు క్రోధస్మితచమత్కారముఖవిక్లబత్వవికారములను గనఁబఱచుట" "ప్రియునిసామీప్యము కలుగుటచే నంగములకుఁ గలుగువిశేషమే విలాసము." యోగము = సంబంధము, విభ్రమము = భ్రాంతిచేఁగలిగిన హావము, తిలకము = పాదమున నుండునొక సౌభాగ్యరేఖ.

39. సవనము = అవగాహము = స్నానము, ఉపస్థానము = సేవ;

పూజ. ప్రాచేతసుఁడు = ప్రచేతసునిపుత్రుఁడు, వాల్మీకి. ప్రచేతసుఁడు = వరుణుఁడు.

40. బాష్పాయమాన = కన్నీరు కాఱుచున్న, నయనుఁడు = నేత్రములు కలవాఁడు. నిస్సంపాత = సంచారము లేకపోవుటచే, వివిక్తము = విజనమైనది; మనుష్యులులేనిది.

41. కిసలయ = చిగురుల యొక్క; సౌకుమార్యమును = మృదుత్వమును హేరు = పరిహసించు; మించు.

42. దివసావసాన = సాయంకాలముచే, వినివారిత = అడ్డుపెట్టఁబడిన, సమాగమము = కూడిక.

44. సంశయవిలీనత = సంశయరాహిత్యము, అనుమానములేమి. ప్రాంశుత్వము = వైశాల్యము.

45. ఉమ్మలిక = వేఁడిమి, అధ్వగులు = బాటసారులు, ప్రమందు = కమలిపోవు, తత్ = అది, (ఆశరీరపుఁగమలిక) మిథ్యానృత్తికిన్ = అసత్యమని తోఁచుటకు = అనఁగా ఆయొడలివేఁడిమి పోవుటకని భావము. తత్ = ఆనది యొక్క, మధ్య = నడుమను, ప్రాప్త = దొరకిన, జల = నీటిచే, అర్ద్ర = తడిసిన కర్ణ = చెవులయొక్క, పవన = గాలివలని, ఆనందము = సంతోషము, ధుని = నది, వేదండరాజము = గజరాజు. ఎన్నిమృగములో యుండఁగా దిఙ్నాగుఁడు నాగరాజునే వర్ణించుట నిజనామ సామ్యమాహాత్మ్య మనఁ జెల్లును.

46. విపరీత = ఆశ్చర్యకరముగా, ఉపహసిత = నవ్వఁబడినది.

47. దీర్ఘిక = సరస్సునందలి దిగుడుబావి.

48. సురభి = సువాసనయొక్క, బహుళ = ఆధిక్యముచే, ఆమోద = సంతోషము, సమారబ్ధ = పొందిన, మధుకరకుల = తుమ్మెదజాతియొక్క, సంగీతముచే; మనోహరము = మనస్సును హరించునది; మంజులమైనది, ప్రావరణము = ఉత్తరీయము. చిత్రకూటము = ప్రయాగసమీపమునఁ గలయడవిలోనున్న యొక చిన్న పర్వతము.

50. ఆమంత్రించుచు=పిలుచు, ఉపాలంభము=నింద; చెప్పు. ధీరోదాత్తము=ధీరమును, ఉదాత్తమును=ధైర్యాన్వితమును, హృద్యమును. నీల పరివేషరేఖ=నల్లనివృత్తాకారమైన మండలరాజి.

51. యూపము=యజ్ఞస్తంభము.
అధ్యాసితము=సేవింపఁబడినది. నిష్ప్రత్యూహము=అడ్డులేనిది.
సూను=కుమారులయందు, ప్రస్ఫుట=చక్కఁగా నుంచఁబడిన, రాజ్యచక్ర=రాజ్యాధికారముచే, విలసత్=ఒప్పుచున్న, స్ఫూర్తిన్=బుద్ధిచే,తపోగాములు=తపముచేయుటకై పోయినవారు.

52. సన్నివసత్=(సమీపమున) చక్కఁగా నివసించుచున్న, మహేశ్వర=శివునియొక్క, శిరః=తలపైనున్న, తారాధిపజ్యోత్స్న=చంద్రుని వెన్నెలతో, సమ్మిళితంబు=చక్కఁగా కలిసినది. కవోష్ణత=గోరువెచ్చఁదనము. పొరయు=పొందు, మిత్రాంశు=సూర్యకిరణముల, తీవ్రప్రభ=తీక్ష్ణమైన కాంతికి (వేఁడిమికి అనిభావము) వితతము=ఎడతెగని=విస్తృతినందిన,నందనచందన ద్రుమాభావత=సాధారణముగా కట్టివేయు నందనవనమందలి మంచిగంధపుఁజెట్టు లిట లేని కారణమున. సురపతిభామిని=ఇంద్రుని యిల్లాలు, శచీదేవి.

53. సహకారము=తీయమామిడి.

54. పదివేలమంది మునులకు అన్నదానాదులు చేయుచు వేదమును చెప్పు బ్రహ్మఋషినే 'కులపతి' యందురు.

55. ప్రస్థితి=పోవుట, లంబాలక=దీర్ఘములైనముంగురులు, పాండుర=తెల్లఁబడిన, వదనము=మొగము, నిస్సంపాత=సంచారములేమి, వివిక్తము=జనులులేనిది.

57. సిద్ధ=వాల్మీకులు, శాసనము=ఆదేశము, పటాంతము=పైబట్ట కొంగు. ఉపధానము=తలగడ. విభావరి=రాత్రి.

58. పటాంచలము=చీరకొంగు. అనవరత=సదా, బాష్ప=వేఁడి కన్నీటిచే, పిహిత=నిండిన, లోచనుఁడు=కన్నులు కలవాఁడు. పరిధాన

కము=దోవతి. కలితచంద్రికా=చంద్రుని కాంతికంటె, నిర్మోక=పాము కుబుసముకంటె, లలితము=సుందరమైనది.

59. పరిగళితము=(జాతి)పడినది. మహసుందరకేశులఙ్=నర్మక్రీడలయందు, మన్మథక్రీడలలో వచ్చు కోపసమయములందని భావము. సాదర=ఆదరముతోఁ గూడినట్టియు. సుఖదాయి=సుఖపారవశ్యము నిచ్చునట్టిదియునైన. సురతాంతములందునన్=రతిక్రీడల తుదిసమయములందు, తాళవృంతమున్=విసనికఱ్ఱ. అసంక్రాంత=అంటుకొనని, విలేపన=గంధద్రవ్యములచే, ఆమోదకము=ఆనందము కూర్చునది.

60. దేవసహాయుని గా=ఒంటరి గా.

61. విస్రబ్ధ=శంక లేని, యథేచ్ఛమైన, సల్లాపములు=మాటలు.

63. విదారించు=పోఁగొట్టు. ఘూర్ణవిధము=చక్రనిరీతి, ప్రవాసినులు=ప్రవాసులభార్యలు, విషాణపంక్తి=శృంగ పరంపర.

64. అతిచల=అతివేగముగల, భాస్కరాశ్వములు=సూర్యుని గుఱ్ఱములు, వాగెలు=కళ్లెములు. సతత=సదా, నిపీడనాత్మక=బాధించునదైన, కశా=కొరడా, హతులఙ్=దెబ్బలచే, స్ఖలిత=తడఁబడిన, అంఘ్రులై=కాళ్లుకలవై, ఖురప్రతతులు=గిట్టలు, భరంబున=శ్రమతో.

65. కృశానునకు=అగ్నికి.

66. ప్రతికృతి=నీడ, పీన=బలుపుచే, పరిపాండుర=మిక్కిలి తెల్లనైన, గండము=చెక్కిలి, లంబకేశము=సుదీర్ఘమైన యలకలు, త్రిదివేశాంగన=తిలోత్తమ. దృప్తాత్మయై=గర్వించినదై, పరిణద్ధ=గ్రుచ్చఁబడిన, ముక్తా=ముత్యముల, హారదండవు=హారముకలవాఁడవు. సమున్నద్ధ=మిక్కిలి యెత్తయినవగుట, దురారోహణములు=ఎక్కరానివి.

67. ఆస్థాన=ఆస్థానమునందు, దాసేర=పనివారిచే నిర్మితమైన, మండప=మండపమునందలి, పుండరీకమునకు=తెల్లతామరపూవునకు, కర్ణికామండలము=ఏనుఁగు తొండముచివర భాగమువలె నుండు బీజకోశము. మధుమథనుఁడు=విష్ణుమూర్తి, పితామహుఁడు=బ్రహ్మ, గురుతర=అధిక

మైన, భార=బరువుగు, ఉద్వహన=మోయుటవలన, జాత=పుట్టిన, శ్రమములో=శ్రమకలిగినవో, ముఖ=ముఖమునుండి, వినిర్గత=విడువఁబడిన, ముక్తాకలాపవ్యాజమున=ముత్తెపువరుసలో యనునట్లు, ఫేనధారలు=నురుఁగులు.
68. కారణ=కారణములచే, అనురోధి=కూడినది. అలీకము=అసత్యము.

69 మొనయును=విలసిల్లును, బిసతంతు=తామరతూడు, దవానల=దావాగ్నిచే, పరిశుష్యము=ఇగురఁజేయఁబడిన, తుపారబిందువు=మంచుబిందువు, నిర్విశేషుఁడు=శేషములేనివాఁడు.

70. ప్రతీహారభూమి=గుమ్మముకడ. సంభృత=నిండిన, వేత్రములు=వేత్రములుకలవారితో (వేత్రహస్తులతో)ఁ గూడినది. మూల=జగమునకు మూలభూతమైన పరబ్రహ్మము యొక్కయు, స్వ=ఆత్మయొక్కయు, యోగ=సంబంధమైన, మూల=నిమిత్తమై, సకలపురుషార్థములను, సంవేదిని=బోధించునది, జ్ఞాననిష్పత్తి=జ్ఞానసంపద. జీవపరమాత్మ సంబంధమే మోక్షము. అదియే పరమపురుషార్థము, అభ్యంతరము=అంతఃకరణమున నున్నది. జ్యోతి=ప్రజ్ఞానాత్మకమైన తేజము. పూజ్యపాద=ఏ మహర్షి చేతనో, దీపితము=దీపింపఁజేయఁబడినది. పవనుఁడు=గాలి, వ్యవహరించు=తనపనితాను చేయు, అగ్ని తా నంటించు స్వభావము గలవాఁడే యైనను, గాలి వీచుటచేతనే యెట్లు తనకృత్యమును నిర్వర్తించునో అట్లే మనలోనే ఉన్న ప్రజ్ఞానాత్మకమైన తేజము తన నిజస్థితిని తెలిసికొనఁ గలిగియు ఏమహాత్ముని జ్ఞానబోధచేతనో కాని తానే పరమాత్మస్వరూప మని తెలిసికొనఁజాలదు. కావున, ఈజ్ఞానమును తమబోధముచే రేకెత్తించుమహర్షులు మన కెంతయుఁ బూజనీయులు. అనుద్భిన్న=ఇంకను ప్రకటన కాని, తారుణ్య=తరుణత్వము కల, విగ్రహులు=దేహులు, మంగళ=కల్యాణముయొక్క, అంకుర=మొలకలో యను, శంకావహులు=సందేహమునకుఁ తావుగలవారు. అసమాప్త=పూర్తికాని, ప్రమాణులు=ఎత్తుకలవారు. (బాగుగా నెదుగుచున్నవా రని భావము) కందర్ప=మన్మథునియొక్క, దారక=కుమారులను, అకృతులు=పోలినవారు. ప్రస్పందులు=స్ఫూర్తివిశేషము కలవారు.

అసంక్షేపితులు=విశిష్టారోహపరిణాహవంతు లగును వారలు, లోల తరులు=బాలసులభమైన చాంచల్యము కలవారు.

71. తోరణస్తంభము=వెలుపలఁగల స్తంభము. దుష్కర=ఇతరులకు సాధ్యము కాని, విన్యాసము=పొందిక, సంవాది=అనుకూలమైనది. రసిత= శింజితముచే, అనువిద్ధము=కూర్పఁబడినది. విజ్ఞాన=విద్యయొక్క, అవలేపము= గర్వము. శౌండీర్యము=గర్వాతిశయము.

72. కాకపక్ష=(కాకిరెక్కలవంటి) శిఖలతో, పరిభూషిత=అలంక రింపఁబడిన, వదనము=ముఖము, సౌవిదల్లులు=కంచుకులు. కంచుకి=అంతః పురమునఁ దిరుగువాఁడు, వృద్ధు, విప్రుఁడు, సుగుణవంతుఁడు, సర్వకార్య కుశలుఁడు నగువాఁడు. సీత్కార=వాత్సల్య సూచకమైనధ్వనితో, లక్షిత= ఒప్పుచున్న, స్మిత=చిఱునవ్వుతోడి, మధురము=మాధుర్యముతో కర్ణ పత్రము=ఒకవిధమగు చెవినగ.

73. అవలేపము=గర్వము, గురునియోగములు: "ఆజ్ఞా గురూణాం హ్యవిచారణీయా" అని కాళిదాసు. ఆకూతము=భావము; చరిత్ర.

74. విలగ్నములు=చక్కగా నతికినవి. విద్రవముల్=చక్కగా ద్రవించునవి. దోషసద్గుణవితీర్ణత=దోషము గుణము అనుభేదము లేమి. వ్యపనీత=నివారింపఁబడిన, బాష్ప=కన్నీరుగల, వ్యవధానములు=అవకాశము కలవి. సన్నివేశము=శరీరమువయస్సు మున్నగువానిస్థితి. అభిక్రాంతము=నడక

76. విధుఁడు=చంద్రుఁడు, కేతక=మొగలిపూవుయొక్క, ఛదతను= దళమువలె మృదువై తెల్లనైనరూపమును. కెరలె=విలసిల్లెను, పరిక్షేపిత = వెడలఁగొట్టఁబడినది; పంపఁబడినది.

77. విప్రయుక్తము=ఎడఁబాటు కలది.

78. స్వస్తి=క్షేమమునకు, అయన=తావులుగా, పరిగృహీత ములు=గ్రహింపఁబడినవి. ప్రథమ=మొదట. పరిణీతము=కోరఁబడినది.

79. అభిజనులు=ఉన్నతవంశమునఁ బుట్టినవారు.

80. మన్యువు=కోపము.

82. అజాతప్రోషితులు=దేశాంతరమున నున్న సంగతి యెఱుంగని వారు; పుట్టకపూర్వమునుండి దేశాంతరమున నున్నవారు.

82. ఆవిశ్వార్కము=ప్రపంచము, సూర్యుఁడు ఉన్నంతవఱకు. మహార్థ=గొప్పలాభము, సంవిధా=కలిగించునది. దశరథ, ఆఖ్యానము=కథ (చూ. పుట 85,౧౩ పం)

83. సజ్జితము=సిద్ధము. పౌర=రాజధానినగరస్థులు, జానపదులు=గ్రామస్థులు.

88. సంహృతము=సమాప్తము, అగమావధియా ? = తెలిసిన దింతియేనా ?

89. తిష్యము=పుష్యమినక్షత్రము. దార=భార్య.

90. పరమార్థము=సత్యము. విలయపవనము=ప్రళయకాలపుగాలి.

92. ప్రతిషేధము=అడ్డు. జాతా=పుత్రా, దుర్లలితులు=లాలిత్య మెఱుఁగనివారు.

93. ధృత=(మనసున) పొందిన, సౌహార్ద=ప్రేమకలవాఁడా! నిర్యోజ్యుఁడు=వశవర్తి. కనీయుఁడు=చిన్నవాఁడు; సమీక్ష్యకారి=ఏపని యైనను చక్కఁగాయోచించి చేయువాఁడు,ప్రత్యయనివృత్తి=అవిశ్వాసము.

94. ప్రాకృతజన=మూర్ఖజనులు, వికారానురూపము=విక్రియానుకూలము. 95. ప్రత్యయము=ప్రతీతి.

96. రసాంతరము=మఱియొకభూమి. ఆపాత=మిక్కిలిపడుట చేత, క్లిష్టత=ఖిన్నత్వముగలది. ధాత్రీమహిళావతంసము = భూదేవి. సంద్రపుఁగాంచి=సముద్రమను నొడ్డాణము.

97. శేష=అదిశేషునియొక్క, వహనము = మోఁత, దేవతలు భూమిని గోవును జేసి మున్ను ఓషధులు పిదుకుకొనిరి.

98. మేఖల = ఒడ్డాణము. సుజ్ఞేయ = చక్కనిజ్ఞానము తార్క్ష్యుండు = గరుత్మంతుఁడు. ప్రణవము=ఓంకారము.

99. అభ్యుద్ధరణము=అవతారము. వితానము=మేలుకట్టు.

100. ఉదాత్త శాలీనము=రమ్యము ధైర్యయుక్తమును.

101. అపత్యము=సంతానము.

103. వేత్రాధికారము=కఱ్ఱపెత్తనము.

104. మకరాలయము = సముద్రము. మాతరిశ్వుఁడు = వాయుదేవుఁడు.

—• పూర్వముద్రిత పద్యములు •—

1. (i. ౧.)

శ్రీ జంభాంతక దివ్యమౌళిఘన రోచిస్స్మేర మందారమా
లాజృంభన్మధుబిందుచుంబక మహాలంకార సౌభాగ్యముల్
నైజప్రస్ఫుట మోహదాహకము లౌ లంబోదర శ్రీపదాం
భోజానూనరజంబు లౌత శుభదంబుల్ పీల్చి విఘ్నాంబుధిన్.

2. (iii. ౧౧.)

పదరచనం బదే, యదియె ప్రస్ఫుటరూపము సుందరంబు, స
మ్మద మొదవించుఁగా తిలకమున్; గడుఁ గమ్రపురేఖ లయ్యవే
యిదివఱ కెల్లు నాహృదయ మెంత హరించెనో యిప్పు డంతగా
సుదతివరాంఘ్రిపంక్తి మనసుఁ గడు ముంచెను హర్షవార్ధిన్.

3. (v. ౧౩)

తాను ప్రవాసియై నిజసుతప్రతిరూపుని నొక్కనిం గనం
గానె జనుండు సూనుఁ గరుణానిలయున్ దలపోసి యెంతగా
మ్లానత గాంచు; నంతటియమానుషనిగ్రహసాధ్యదుఃఖ మీ
మానిసిమారులం గనిన మాటికి నన్ను దహించివైచెడున్.

4. (vi. ౪౪.)

భవదీయం బగుదర్శనంబున నె దేవా! యేర్పడెన్ శుద్ధిస
ర్వవిధానక్రియ నాదుజన్మమునకున్ భార్యాలసత్కీర్తికిన్
సువిధేయుల్ సుతులైరి మామకమహాక్షోణీతలస్వీకృతిన్;
ఇవి గాకన్యము లైనకామ్యములు నాకేవీ మిముక్ వేఁడఁగన్.

---

Andhra Pracharini Printing Works, Kakinada.

# శ్రీ వేంకటేశ్వర గ్రంథావళి.



ప్రతులకు: బులుసు వేంకటేశ్వరులు, బి. ఏ.,
రామారావుపేట, కాకినాడ: అని వ్రాయునది.